కొత్తది!

# అముల్ మాల్ట్-కోకో పానీయం

# న్యుట్రాముల్

## ప్రతి కప్పు మీకు పోషణను ఇచ్చు

అముల్ బలాన్నిచ్చే న్యుట్రాముల్ – ఇంతకుమును ఎన్నడూ అందించబడని ఆరోగ్యాన్నిచ్చే పానీయం సమర్పిస్తోంది. సమృద్ధిగా పాలు, శుద్ధమైన మాల్ట్, ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజములుగలది, ప్రతి కప్పు ఆరోగ్యాన్ని, శక్తిని పెంపొందిస్తుంది.

మరిక దీని రుచి! అమ్మమ్మ! ఎంతో ఎక్కువ కోకో మరెంతో ఎక్కువ పాలు

సమృద్ధియైన నురుగు గల కోకో గలది.
న్యుట్రాముల్ అముల్‌వారి కొత్త పాలు మరియు ఆహారాల ప్రోసెసింగ్ కేంద్రంలో—ప్రపంచంలో మేలైన వాటిలో ఇది ఒకటి–రూపొందించబడుతోంది

ప్రతి న్యుట్రాముల్ డబ్బాలో 500 గ్రాముల సరకు ఉంటుంది. అంటే ఇతర వాటికన్న 50 గ్రాములు (5 కప్పులు) అదనం అన్న మాటేగా.

న్యుట్రాముల్ నేడే వాడి చూడండి.




ప్రతి డబ్బాలో 50 గ్రాముల ఎక్కువ సరుకు





మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్

daCunha/Nutra/1 P Tel

# జెమ్స్‌తో బలే మజా

## అదృష్టవంతులు గెలుపొందేందుకు 1001 బహుమతులు

వీటిలో సరిపడని అంకె ఏమిటో చెప్పుకోండి చూద్దాం







**త్వరపడండి!** మీ జవాబుతోపాటు క్యాడ్‌బరిస్ జెమ్స్ యొక్క ఖాళీ ప్లాస్టిక్ ప్యాకెట్ ఒకటి జతపరచి పంపండి. సరియైన జవాబు పంపిన మొదటి 1001 మంది విజేతలకు రూ. 11 విలువగల స్టేట్ బ్యాంక్ కానుక చెక్‌లు లభిస్తాయి.

మీ జవాబు, మీ పేరు, మీ చిరునామా కూడా ఇంగ్లీషులోనే పెద్ద అక్షరాలలో వ్రాయండి.
మీ ఎంట్రీలను ఈ క్రింది చిరునామాకు పంపండి.
"Fun with Gems' Dept. F–23
Post Box No. 56. Thane 400 601.
ఎంట్రీలు గ్రహించుటకు ఆఖరు తేది:
31–12–1977

**చాక్లెట్ మధ్యలోగలిగిన రంగురంగుల క్యాడ్‌బరిస్ జెమ్స్**

CHAITRA-C-69 TEL









AM-1578 TEL

# అమృతాంజన్
## శక్తివంతమయిన బాధానివారిణి




# అనోలియమ్
## జలుబుకి సున్నితమయిన మందు




అమృతాంజన్
శక్తివంతమయినది. తల నొప్పులు, వెన్ను నొప్పులు, కండరాల నొప్పులు, బెణుకులు మరియు జలుబుల నుంచి శీఘ్రంగా ఉపశమనం కలిగించడానికి దానిలో పది శ్రేష్ఠమైన ఔషధాలు వున్నాయి.

అనోలియమ్ జలుబులని, దగ్గులని పారద్రోలుతుంది. మృదువయిన చర్మాలకోసము అది ప్రత్యేకంగా తయారుచేయబడింది. మీ ఇంట్లో వాటిని ఎప్పుడూ అందుబాటులో వుంచుకోండి.

అమృతాంజన్ మరియు అనోలియమ్ — ఇంటింటా అవసరమయిన నమ్మకమయిన దివ్య ఔషధములు.

**అమృతాంజన్ లిమిటెడ్.**
80 సంవత్సరాలకు పైగా నమ్మకమయిన గృహ ఔషధములను తయారుచేస్తున్నవారు.

# చిల్లర పైసలే మీ జీవితంలో పెద్ద మార్పు తేగలవు







మీరు
రూపాయల
విషయంలో
శ్రద్ధ వహిస్తుండే
సమయంలో చిల్లర
పైసలు తెలియ కుండానే మాయమై
పోతుంటాయి. మీ గృహబడ్జెట్టులో
మిగిలే మిక్కిలి చిన్నవనుకొనే 5
10, 25 పైసల నాణెములే తగినంత పొదుపు
నిధిగా మారగలవన్న విషయం మీరెరుగరా ?
చిన్న చిన్న మొత్తాల పొదుపు క్రమేణా పెరిగి
పెద్ద మొత్తమవుతుంది---అదే బాల క్షేమ
డిపాజిట్ పథకం
పొదుపు విలువ గురించి మీ పిల్లలకు నేర్పండి
మేమిచ్చే ఆకర్షణీయమైన పొదుపు పెట్టెలో
చిల్లర పైసలు వేయడానికి మీ పిల్లలు ఎంతో
ఉత్సాహపడతారు. పొదుపు పెట్టె తాళంచెవి
తీసుకొని మా బాలక్షేమ ఏజెంటు ఇంటింటికీ వస్తారు
మీ గుమ్మందగ్గరకే వచ్చి మీరుపొదుపు చేసిన
మొత్తానికి రసీదు ఇచ్చి స్వీకరిస్తారు
చిన్న చిన్న మొత్తాల పొదుపు క్రమేణా పెద్ద
మొత్తంగా పెరగడం మీకు ఆనందాన్ని,
ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.




## బాలక్షేమ డిపాజిట్ పథకం




## కెనరా బ్యాంక్

(భారత ప్రభుత్వ
సంపూర్ణస్వామ్యంలోనిది)
హెడ్ఆఫీసు : బెంగళూరు-560 002

ప్రగతికొరకు సేవ
సేవ కొరకు ప్రగతి

maa CB Tel 2



5

# వినతి

ఆంధ్రదేశంలోని కొన్ని జిల్లాలు ఈ మధ్య అకస్మాత్తుగా పెను తుఫానుకు బలయి ఎంతగానో నష్టపడ్డాయి. వేలాది ప్రజలు ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఇళ్లు, పంటలూ ధ్వంసమైపోయాయి. ఎన్నో సోదర కుటుంబాలు నిలవ నీడ లేక అల్లాడి పోతున్నాయి. పలువిధాల నష్టపోయిన సాటిమానవులకు, సహాయ పడవలసిన విధి, కర్తవ్యం మనందరిమీదా వున్నది. ప్రతివారూ ఈ 'సహాయం' తమ తక్షణ కర్తవ్యంగా భావించి - తమ శక్త్యానుసారం ''ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నిధి''కి విరాళంగా పంపి, సాటి ప్రజలను ఆదుకోవలసిందిగా 'చందమామ' అభ్యర్థిస్తున్నది.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''ఋణవిముక్తి''] కి ఆధారం వల్లూరు బాబూరావు రచన.

పాండవులు వనవాసం చేసేటప్పుడు దుర్యోధనుణ్ణి గంధర్వుడి నుంచి విడిపించటానికి భీమార్జునులు, ''కాగల కార్యాన్ని గంధర్వులే తీర్చుతారు,'' అంటే, ధర్మరాజు ఒప్పుకోక, ''మన మధ్య శత్రుత్వం మాటకు వస్తే కౌరవులు నూరుగురు, మనం అయిదుగురం. మూడో శత్రువు వచ్చినప్పుడు మనం నూట అయిదుగురం'' (''వయం పంచాధికం శతం'') అన్నాడు. దాదాపు అలాటి నీతే మనకు ''బలమైన శత్రువు'' కథలో కనిపిస్తుంది.

సంపుటి 61 డిసెంబర్ '77 సంచిక 6

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00




CHITRA




భూయో వినయ మాస్థాయ
భవ నిత్యం జితేంద్రియః,
కామక్రోధసముత్థాని
త్యజేథా వ్యసనాని చ. 1

[నువు వినయంగానూ, జితేంద్రియుడివిగానూ ఉంటూ, కామ క్రోధాదుల నుంచి పుట్టే వ్యసనాలను త్యజించు.]

పరోక్షయా వర్తమానో
వృత్త్యా ప్రత్యక్షయా తథా,
అమాత్యప్రభృతీ స్సర్వాః
ప్రకృతి శ్చానురంజయ. 2

[నువు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ మంత్రులు మొదలైన వారికి ఆజ్ఞలు ఇస్తూ, ప్రజలనందరినీ సంతోషపెట్టు.]

తుష్టానురక్త ప్రకృతి
ర్యః పాలయతి, మేదినయ్
తస్య నందంతి మిత్రాణి
లబ్ధామృత మివామరాః. 3

[ప్రజలను తృప్తిపరచి భూమిని పాలించేవాణ్ణి చూసి, అమృతం దొరికిన దేవతల్లాగా, మిత్రులు సంతోషిస్తారు.

---

కాబోయే రాజుకు హితాలు

---




## 54

రక్తాక్ష పాము కథ చెప్పి, "మనం వీణ్ణి చంపి, ఈ మర్రిచెట్టు రాజ్యాన్ని సొంతం చేసుకుని, నిర్భయంగా జీవింతాం," అన్నది.

అరిమర్దనం క్రూరాక్ష అభిప్రాయం అడిగింది.

"నేను రక్తాక్ష సలహాతో ఏకీభవించను. మనను శరణుజొచ్చిన ఈ దిక్కుమాలిన కాకిని చంపటం నా మతం కాదు. శిబిచక్రవర్తి కథ వినలేదా? గువ్వల కథ వినలేదా?" అన్నది క్రూరాక్ష.

"ఏమిటా కథలు?" అని అరిమర్దనం అడిగితే క్రూరాక్ష ఇలా చెప్పింది:

"ఒకప్పుడు శిబిచక్రవర్తి అనేవాడు ఉండేవాడు. భారతదేశంలోని రాజులందరూ అతనికి సామంతులు. శిబి దయాస్వరూపుడు. మహాదాత. అతని దాతృత్వ ఖ్యాతి స్వర్గానికి కూడా వ్యాపించింది. ఇంద్రుడు ఇలా అనుకున్నాడు:

"శిబి లాటి దాత మరొకడు లేడు. ఇలా అంతులేని దానధర్మాలు చెయ్యటంలో అతని అభిప్రాయం ఏమై ఉంటుంది? కీర్తి కాంక్షతో ఇలా చేస్తున్నాడా, లేక అతనికి నిస్సహాయులపై నిజంగా జాలి ఉన్నదా?"

ఇంద్రుడు యముణ్ణి పిలిపించి, అతనితో కలిసి ఒక పథకం ఆలోచించాడు.

ఒకరోజు ఉదయం శిబి కాలకృత్యాలు తీర్చుకుని సభా భవనానికి వచ్చి కూర్చున్నాడు. ఇంద్రుడు ఒక పావురాయి రూపం ధరించి, రాజోద్యానం మీదుగా ఎగురుతూ సభా భవనంలోకి వచ్చాడు. యముడు డేగ రూపంలో ఆ పావురాన్ని తరుముకుంటూ వచ్చాడు.



ఆయాసంతో రొప్పుతూ, భయంతో వణుకుతూ, బెదురుకళ్ళతో పావురం శిబి పాదాల వద్ద పడింది. "రాజా, నేను నీ శరణుజొచ్చాను. నన్ను డేగ నుంచి కాపాడు," అన్నది పావురం.

అది ఇలా అంటూండగానే డేగ అక్కడికి చేరుకుని, "రాజా, పావురాన్ని వదులు. ఆకలిగా ఉన్న నాకు నా ఆహారాన్ని ఇచ్చెయ్యి," అన్నది.

"ప్రభూ, శరణన్నవాణ్ణి రక్షించటం ధర్మం," అన్నది పావురం.

"రాజా, ఎలాటి అభాగ్యుడుగాని, ఆర్తుడుగాని, ఏం కోరినా నువు ఇస్తావని చెప్పుకుంటారు. ఈ పావురం నాకు న్యాయమైన ఆహారం. నేను ఆకలితో చచ్చిపోతున్నాను," అన్నది డేగ.

"బుద్ధిమంతులు శరణాగతులను రక్షిస్తారు. నా పాకశాల నుంచి నీకు కావలసినంత మాంసం తెప్పించి ఇస్తాను. పావురాన్ని వదిలెయ్యి," అన్నాడు శిబి.

"ఒకరు చంపిన వాటిని మా డేగలు ముట్టవు. వెచ్చని రక్తం ఓడుతూ, సజీవంగా ఉండే మాంసాన్నే తింటాం. ఈ పావురం బదులు దాని ఎత్తు నీ మాంసం ఇవ్వు, ఆమోదిస్తాను," అన్నది డేగ.

"సరే, అలాగే నా మాంసం ఇస్తాను," అని శిబి, తన కోశాగారం నుంచి త్రాసు తెమ్మని ఆజ్ఞాపించాడు.

ఈ మాట విని సభలోని రాజులూ, పౌరులూ గొల్లున గోలెత్తి, "ఈ డేగ తమరిని నిర్మూలించ వచ్చిన ఎవరో రాక్షసుడు," అన్నారు. శిబివారి మాటలు వినిపించుకో లేదు.

త్రాసు వచ్చింది. ఒక పళ్ళెంలో పావురాన్ని ఉంచి, శిబి తన తొడ నుంచి మాంసం కోసి రెండవ పళ్ళెంలో వేశాడు. కాని పావురం బరువే హెచ్చుగా ఉన్నది. శిబి తన శరీరం వివిధ భాగాల నుంచి ఎంత మాంసం కోసినా పావురం బరువుకు చాలలేదు. చివరకు శిబి తానే పళ్ళెంలో కూర్చున్నాడు.

ఈ అపూర్వ త్యాగానికి దేవదుందుభులు మోగాయి. ఆకాశం నుంచి పుష్ప వర్షం కురిసింది. అన్ని వైపుల నుంచీ అశరీరవాక్కులు, "భేష్! శబాష్!" అనటం వినిపించింది.

ఇంద్ర యములు తమ అసలు రూపాలలో శిబి ఎదట ప్రత్యక్షమై, "రాజా, మేలు మేలు! ప్రాణులపట్ల నీగాఢప్రేమ గ్రహించాం. నువు ఒకడివే సత్యం గ్రహించిన వాడివి. నీ శరీరం ఎప్పటిలాగే అవుతుంది," అని అదృశ్యమయారు.

### ఆత్మార్పణ చేసుకున్న గువ్వ కథ

ఉచ్చులు పన్నటంలో నిపుణుడైన బోయవాడొకడు అరణ్యంలో ఉండగా భయంకరమైన గాలి వాన వచ్చింది. వాడు నిలువునా తడిసిపోయి ఒక చెట్టు కింద తల దాచుకున్నాడు.

ఆ చెట్టు మీద ఒక గువ్వలజంట ఉంటున్నది. ఆడగువ్వ ఎటో వెళ్ళింది. మగగువ్వ తన భార్య కోసం ఆదుర్దాపడుతున్నది. ఇంతలో ఆడగువ్వ తిరిగి వచ్చి బోయవాడి దీనస్థితి చూసింది. వాడు గువ్వలను తన చలి బాధా, ఆకలి బాధా తీర్చమని వేడుకున్నాడు.

మగగువ్వ తమ గూటి నుంచి ఆకులూ, పుడకలూ తీసి పోగువేసి, ఆ కుప్పకు మంటపెట్టి, బోయవాణ్ణి చలి తీర్చుకోనిచ్చింది. బోయవాడు ఆకలితో చచ్చిపోతున్నానన్నాడు. తన అతిథికి ఇయ్యటానికి ఏమీలేక, మగగువ్వ ఆ మంటలో పడి కాలిపోతూ, తనను తినమని బోయవాడికి చెప్పింది.

"నా మొగుడు లేక నేను ఎలా బతుకుతాను?" అంటూ ఆడగువ్వ కూడా మంటలో పడింది. ఆ గువ్వల జంటను ఒక బంగారు రథం స్వర్గానికి తీసుకుపోయింది.

ఇదంతా చూసిన బోయవాడు తన క్రూరజీవనానికి సిగ్గుపడి, గువ్వలను తినక, అరణ్యంలో పోతూ కార్చిచ్చును చూసి, అందులో పడి తానూ కాలిపోయాడు.



# 192. సముద్రం సృష్టించిన గుహ

ఈ బొమ్మలో కనిపించే గుహ అల్యూషియన్ దీవులలో టనగా దీవిలోది. ఏ కృతయుగంలోనో అగ్ని పర్వతం పేలి, 70 అడుగుల మందాన శిలాద్రవం నిలిచింది. అది చల్లబడి, సంకోచించేటప్పుడు అందులో పగుళ్ళు ఏర్పడ్డాయి. తరవాత కొన్ని వేల సంవత్సరాల మీదట సముద్రపు తాకిడికి ఈ గుహ ఏర్పడింది. దీని లోతు 75 అడుగులు!






# మాయాసరోవరం

## 24

[హంసలరథం మీదికి దాడి వచ్చిన జలవృకరాక్షసులను జయశీలుడూ, అతడి అనుచరులూ ఎదుర్కొని, హతమార్చారు. మాయాసరోవరేశ్వరుడూ, రాజకుమారి కాంచనమాలా రథం మీది నుంచి అరణ్యంలో పడిపోయిన చోట, తెల్లని పొగ లేస్తూండటం చూసి, అందరూ ఆ ప్రదేశానికి బయలుదేరారు. తరవాత—]

**హం**సల రథం తలకిందులైనప్పుడు, అందులో నుంచి జారిపడిన మాయా సరోవరేశ్వరుడూ, కాంచనమాలా, రథం తోలేవాడూ—ముగ్గురూ అరణ్యంలో ఒకే ప్రదేశాన కాక, వేరు వేరు ప్రదేశాల్లో పడిపోయారు. అలా పడటంలో మాయా సరోవరేశ్వరుడు నేలనుతాకి ప్రాణాలు కోల్పోలేదుగాని చాలా విచిత్రమైన అనుభవానికి మాత్రం గురయ్యాడు.

అతడు హంసలరథం నుంచి పడిన ప్రదేశాన, నరభక్షకులు నివసిస్తున్నారు. వాళ్ళకు అప్పటికి వారం రోజులుగా అరణ్యంలో వేటాడేందుకు ఏ జంతువూ దొరకలేదు. అందుక్కారణం, అక్కడికి చాలా దూర ప్రాంతం నుంచి ఆహారం వెతుక్కుంటూ ఒక పులుల గుంపు రావటం! ఆ పులులు కనబడిన లేళ్లనూ, ఇతర సాధు ప్రాణులనూ వెంటబడి



సంవత్సరాని కొకసారి అయినా, నర మాంసాన్ని నైవేద్యం పెట్టేవాళ్లెవరు?

బెబ్బులిదొర యిలా ఆలోచించి, ఏ విధంగా అయినా సరే తన జాతి వాళ్ళను ఆ ప్రాంతం వదిలిపోకుండా కట్టుదిట్టం చేయాలనుకున్నాడు. అందు కవసరం అయిన శక్తినివ్వమని ప్రార్థించేందుకు ముందుగా అతడు ఊడలమర్రి కింద వున్న అరణ్యదేవర ఆలయానికి బయలుదేరాడు.

ఆ ఆలయం అతి పురాతనమైనది. దానికి తలుపులూ, దర్వాజాలంటూ ఏమీ లేవు. వానాకాలంలో పెనుతుఫాను గాలికి తట్టుకోలేని అరణ్య మృగాలు కొన్ని అప్పుడప్పుడూ రాత్రివేళల్లో అందులో తలదాచుకోవటం జరుగుతూంటుంది.

ఆ రోజు సూర్యోదయం వేళ బెబ్బులి దొర శిథిల దేవాలయంలోకి పోతూనే ఒక అద్భుతం చూశాడు. ఒక పెద్ద కొండచిలువ, అరణ్యదేవర విగ్రహం ముందు, ఒక తోడేలును తన శరీరంతో చుట్టబెట్టి వున్నది. కాని, దాని తల తోడేలు నోటికి చిక్కి వున్నది. ఆ రెండూ ఒకదాన్నొకటి చంపేందుకో, లేక ప్రాణాలతో బయటపడేందుకో తీవ్రంగా పెనుగులాడుతున్నవి.

తరిమి, దొరికిన వాటిని తినసాగినై. ఆ వేటలో అవి చేసే భయంకర శబ్దాలకు బెదిరి అడవి జంతువులన్నీ దాపులనున్న కొండలు దాటి, అవతలికి పారిపోయినై.

నరభక్షకుల నాయకుడి పేరు బెబ్బులి దొర. అతడికి తన అనుచరులలో నమ్మకస్థుల ద్వారా, తన జాతి వాళ్ళల్లో కొందరు పలాయనం చేయబోతున్నారని తెలియవచ్చింది. అతడికి తన పూర్వులు ఎన్నో తరాలుగా పుట్టి పెరిగి గిట్టిన ఆ అరణ్య ప్రాంతాన్ని వదిలి పోవటం మహా పాపంగా తోచింది. తాము అక్కడ లేకపోతే, ఊడలమర్రి నీడలో వున్న శిథిలదేవాలయంలోని అరణ్యదేవరకు,

ఈ దృశ్యం చూసి బెబ్బులిదొర భయ కంపితుడై, వెనుదిరిగి పారిపోబోయి, అంతలోనే ధైర్యం తెచ్చుకుని, దూరంగా అరణ్యదేవర రాతివిగ్రహం ముందు ప్రాణాచారం పడిలేచి, "ఆహాఁ, అరణ్య దేవరా, నీ మహత్తులు మహా చిత్రమైనవి గదా! వారం రోజులుగా నీ భక్తులమైన మా జాతివాళ్ళం ఆకలితో నకనక లాడుతున్నాం. వాళ్ల నాయకుడైన యీ బెబ్బులిదొరకు, యీ అద్భుతం కళ్ల గట్టేట్టు చూపించి, ఏమని ఆజ్ఞాపిస్తు న్నావు?" అన్నాడు.

ఆ వెంటనే కూలిపోయిన గోడ రాళ్ళల్లోంచి ఒక అడవిపిల్లి తల బయిటికి పెట్టి, చెవులు గింగుర్లెత్తేట్టు, "మ్యావ్! మ్యావ్!" అన్నది.

"ఇది మరొక మహత్తు! వీటి గూఢార్థాలు ముసలి గణాచారి చెప్పా ల్సిందే!" అంటూ బెబ్బులిదొర పెద్దగా ఒక కేకపెట్టి, తన జాతివాళ్ళ దగ్గిరకు పరుగు, పరుగున వచ్చాడు.

ఆ సమయంలో నరభక్షకులు ఆడా, మగా, పెద్దా, చిన్నా అందరూ అరణ్యం లోని ఒక చిన్న మైదాన ప్రదేశంలో కూర్చుని, ఆకలి పోగొట్టుకునేందుకు ఏ చెట్లకాయలో, దుంపలో, వేళ్ళో తినటం ఎలా వుంటుందని, కడబట్టిన



ప్రాణాలతో చర్చించుకుంటూ, మధ్య మధ్య కీచులాడుకుంటూ, జుట్లు జుట్లు పట్టుకోబోతున్నారు.

బెబ్బులిదొర శిథిలదేవాలయం నుంచి వాళ్ళ మధ్యకు రొప్పుతూ రోస్తూ వచ్చి, "అరణ్యదేవర మనను కనికరించాడు! గణాచారి ఎక్కడ?" అంటూ అరిచాడు.

నరభక్షకులంతా ఒక్కసారిగా తమ నాయకుడి కేసి చూశారు. అతడి మాటల్లో వాళ్ళకు లేళ్ళ గుంపులూ, అడవి పందుల మందలూ కనిపించినై. వాళ్ళల్లో కొందరు కుర్రవాళ్ళు ఎగిరి గంతేసి, "బెబ్బులి దొరా, అరణ్యదేవర గుళ్ళో లేళ్ళూ, దుప్పలూ ఏమైనా చేరినయ్యా? ఈ బెలూ,



కత్తులా అందుకోమంటావా ?'' అని అడిగారు.

బెబ్బులిదొర చుట్టూ ఓమారు కలయ చూసి, గణాచారి కనబడకపోయేసరికి గట్టిగా విసుక్కుని, ''ఒరే, చచ్చు వెధవల్లారా, నేనడిగిందేమిటి? మీ రనే దేమిటి? ముసలి గణాచారి ఏమయ్యాడు? అరణ్యదేవర గుళ్ళో కంటబడినదాంట్లో, ఏదో గూఢార్థం వున్నది. విప్పి చెప్ప గలవాడు గణాచారొక్కడే. పిలవండి!'' అన్నాడు.

గణాచారి దూరంగా వున్న ఒక చెట్టు నీడన కూర్చుని, ఆకలితో ప్రాణం శోషకు రాగా కునికిపాట్లు పడుతున్నాడు. అతడు చెట్టు కింద వున్న సంగతి కుర్రవాళ్ళు చెప్పగానే, బెబ్బులిదొర గణాచారి దగ్గిరకుపోయి, తాను గుళ్ళో చూసిన దేమిటో చెప్పి, ''గణాచారీ, దాని అర్థ మేమిటి ?'' అని అడిగాడు.

గణాచారి ఆ మాటలు సరిగా విని పించుకోక, యింకా కునికిపాట్లు పడు తూనే, ''మన జాతి గణాచారిగా, నా జుట్టు నెరిసిపోయింది. అరణ్యదేవర ఏదీ సూటిగా చెప్పదు; అన్నీ గూఢార్థాలే! నాకు తోస్తున్నదేమంటే, మన జాతివాళ్లు కూడా, తతిమ్మా అరణ్య జాతుల్లాగే, దొరికినప్పుడు మాంసం, అది దొరక నప్పుడు వెదురు బియ్యం, కాయా కసుపూ తిని బతకటం నేర్చుకోవటం మంచిదని,'' అన్నాడు.

ముసలి గణాచారి మాట ముగించే లోపలే బెబ్బులిదొర పక్కన వున్న ఒకణ్ణుంచి కర్ర లాక్కుని, ''ఒరే, దుర్మార్గుడా! మన జాతి మాంసం తప్ప మరేమీ ముట్టగూడదని కట్టడి వున్న సంగతి మరిచావా ?'' అంటూ గణాచారి వీపు మీద గట్టిగా ఒక చరుపు చరిచాడు.

ఆ దెబ్బకు గణాచారి లేచి నిలబడి, జుట్టు విదిలించుకుని, "అరణ్యదేవరో!" అంటూ ఒక కేకపెట్టి, ''ఓరి బెబ్బులీ, యిప్పుడు చెప్పు! సంగతేమిటి? నీ దెబ్బతో

ఆకలిపోయి, ఒంటికి శివమెత్తుతున్నది," అని, ఎగిరి అందుబాటులో వున్న చెట్టు కొమ్మ పట్టుకుని, కోతిలా ఊగసాగాడు.

బెబ్బులిదొర చెప్పిన మీదట ఇద్దరు ముగ్గురు నరభక్షక కుర్రాళ్లు చేరి గణాచారి కాళ్లు పట్టుకు గుంజి, అతడు కిందపడే సమయానికి నడుం పట్టుకుని నిలబెట్టారు. బెబ్బులిదొర మరొకసారి తాను గుళ్ళో చూసినదంతా ముసలి గణాచారికి చెప్పాడు.

ఈసారి గణాచారి అంతా శ్రద్ధగా విని, తల పైకెత్తి కొంచెంసేపు ఆకాశం కేసి చూసి, చప్పున వంగి, యింత మట్టి తీసుకుని, ఏవో మంత్రాలు చదివి, అక్కడ వున్న వాళ్ళందరి తలలమీదా పడేలా వెదజల్లి, "ఇక్కడ, చెట్టూ చేమా లేని ఖాళీచోట, నిప్పుచేసి, దాని మీద బాన నిండుగా నీళ్ళు కాచండి. ఈ లోపల కొందరు పోయి అరణ్యదేవర గుళ్ళో వున్న కొండ చిలువనూ, తోడేలునూ, అడవిపిల్లినీ యిక్కడికి తెండి," అన్నాడు.

"ఆ అడవిపిల్లి యింకా విరిగిపోయిన గుడి రాళ్ళ సందున వుంటుందనుకోను. కొండచిలువా, తోడేలూ యీ సరికి ఒక దాన్నొకటి చంపుకొని వుంటవి. వాటిని తెప్పిస్తాను," అన్నాడు బెబ్బులిదొర.



"ఆ అడవిపిల్లి దొరక్కపోతే, అది కూర్చుని మ్యావ్ అన్న రాయినైనా తేవాలి. దాన్ని కూడా సలసల కాగే నీటి బానలో వుంచి తీరాలి," అన్నాడు ముసలి గణాచారి గుడ్లురుముతూ.

"ఇంతకీ అరణ్యదేవర తన గుళ్ళో, యీ కొండచిలువా, తోడేలూ అద్భుతం ఎందుకు చూపాడు? మనకు త్వరలోనే వేటాడేందుకు జంతువులు దొరికేనా?" అని అడిగాడు బెబ్బులిదొర భయపడుతూ.

ఆ ప్రశ్నకు గణాచారి ఎగిరి గంతేసి, పూనకం వచ్చినవాడిలా జుట్టు పీక్కుని, అటూ యిటూ ఊగుతూ, "నేనెవర్ని? అరణ్యదేవర్ని! నేను కరుణిస్తే జంతు



మాంసమే కాదు, మనిషి మాంసం కూడా దొరుకుతుంది. ఇక కదలండి!'' అంటూ అరిచాడు.

ఆ మరుక్షణం కొందరు చెట్ల మధ్య ఖాళీ ప్రదేశంలో పెద్ద గుంట తవ్వి, నిప్పుచేసి, దానిమీద పెద్ద నీళ్ళబాన పెట్టారు. ఉత్సాహం పట్టలేని కుర్రవాళ్లు కొందరు దొరికిన ఎండుకట్టెనల్లా తెచ్చి, నిప్పుల్లో వేయసాగారు. కొద్దిసేపటికల్లా తెల్లని పొగ ఆకాశం కేసి లేచింది.

అలాంటి సమయంలోనే మాయా సరోవరేశ్వరుడు ఎక్కివస్తున్న హంసల రథం మీద, ఆకాశంలో కొన్ని రాబందులు వచ్చిపడినై. హంసలు రథాన్ని తలా ఒకవైపుకూ లాగి, దాన్ని తలకిందులు చేసినై. రథం కొయ్యల్లో ఒకదాన్ని పట్టుకుని అంగరక్షకుడు మాత్రం కింద పడకుండా వుండిపోయాడు. రథం తోలే వాడూ, కనకాక్షరాజు కుమార్తె కాంచనమాలా, మాయాసరోవరేశ్వరుడూ ఒక్క ఊపున అంత ఎత్తునుంచి పల్లటీలు కొడుతూ నేలకేసి రాసాగారు.

ఆ సమయంలో పైన వీస్తున్న గాలి తాకిడికి ముగ్గురూ ఒకరి నుంచి ఒకరు దూరమైపోయారు. శివమెత్తి జుట్టు విరబోసుకుని గంతులు వేస్తున్న ముసలి గణాచారికి, ఆకాశం నుంచి భూమికేసి వస్తున్న మాయాసరోవరేశ్వరుడు కంట బడగానే, ''హాఁ, ఆకలికి అలమటించి పోతున్న మన జాతివాళ్ళను అరణ్యదేవర కనికరించాడు. అదుగో, చూడండి! మనకు ఆహారంగా మనిషినే పంపుతున్నాడు! బానలో నీళ్ళు తొందరగా వెచ్చపడేట్టు చూడండి. మనిషీ, కొండచిలువా, తోడేలూ, అడవిపిల్లీ—ఇన్ని జీవాలు కలిసిన మాంసాన్ని ముందుగా అరణ్యదేవరకు నైవేద్యం పెట్టాలి. ఆ తరవాత మనకు కావలసినంత వేట మాంసం దొరుకుతుంది!'' అన్నాడు.

నరభక్షక జాతివాళ్ళందరూ తలలెత్తి ఆకాశం కేసి చూస్తూ, ఉత్సాహంగా

చప్పట్లు చరచసాగారు. హంసలరథం మీది నుంచి జారిపడటం దురదృష్టమే అయినా, మాయాసరోవరేశ్వరుడు అంత ఎత్తు నుంచి భూమిమీద పడి చావకుండా, అదృష్టవశాత్తూ సూటిగావచ్చి నరభక్షకులు నీళ్ళు కాస్తున్న పెద్ద బానలో పడ్డాడు. అతడు నీటిలో ఒక మునక వేసి, చిన్నగా అరుస్తూ లేచి, బాన అంచులు పట్టుకుని చుట్టూ కలయచూస్తూనే, నరభక్షకులు కంటబడగానే అదిరిపడ్డాడు.

ముసలిగణాచారి నవ్వుతూ అతడి దగ్గిరకు వచ్చి, "అరణ్యదేవర ఏ బక్క చిక్కిన జీవినో కాకుండా, కాస్త ఒంట కండా, మాంసం వున్నవాణ్ణే బహూకరించాడు. ఆ బహుమానాన్ని కూడా మాకు శ్రమలేకుండా, మాంసాన్ని ఉడకబెట్టే బానలోకే సరాసరి చేర్చాడు," అన్నాడు.

గణాచారి యిలా అన్నతరవాత గాని, మాయాసరోవరేశ్వరుడికి తాను అరణ్యజాతుల చేత జిక్కటమే కాకుండా, ఆ చిక్కటంలో నరమాంసం తినేవాళ్ళ చేతుల్లో చిక్కినట్టు అర్థంకాలేదు. ఇప్పుడు తానేం చేసేట్టు? ఎంత వాడికి ఎంత దుర్గతి? అనుకుంటూ అతడు విచారించేంతలో, బానలోని నీళ్ళు క్రమంగా వేడెక్కుతూండటంతో, శరీరం చుర్రుమన్నది.




మాయాసరోవరేశ్వరుడు బెంబేలు పడిపోతూ, బానలో నుంచి బయిటికి రాబోయాడు. ముసలిగణాచారి కాలుతున్న ఒక కట్టె తీసుకుని, అతడి కేసి గురిచేసి, "ఒరే, అరణ్యదేవర ఆహారంగా పంపిన మనిషీ! బానలోని నీళ్ళు వేడిగా వున్నవని బయటికి వచ్చావో, బాన కింది నిప్పుల్లోవేసి కాలుస్తాను, జాగ్రత్త!" అన్నాడు.

ఆ మాటలతో మాయాసరోవరేశ్వరుడికి తనకు చావు తప్పదని తోచింది. అయినా ఆ చావటం వేడినీళ్ళల్లో కాలి కాలి చావటం బాధాకరంగదా? ఎలా అయినా సరే ముందు బానలో నుంచి బయట

పడాలి! ఇలా అనుకుంటూనే చప్పున అతడికొక ఉపాయంతోచింది. అతడు గణాచారితో రహస్యం చెబుతున్న వాడిలా చిన్న గొంతుతో, "నువ్వు, అరణ్యదేవర గణాచారివిగదా? అయితే నీతోనే యీ రహస్యం చెప్పాలి. మీ దేవర నాతోపాటు ఆకాశంలోంచి మరి ముగ్గుర్ని కూడా మీకు ఆహారంగా పంపాడు," అన్నాడు.

గణాచారి ఆశ్చర్యపోతూ, "మరి వాళ్ళెక్కడ?" అన్నాడు.

"వాళ్ళు దారితప్పి, అరణ్యంలో మరెక్కడో దిగినట్టుంది. నన్ను వెంట బెట్టుకు పోయావంటే, వాళ్ళను వెతికి పట్టిస్తాను," అన్నాడు మాయాసరోవరేశ్వరుడు.

ఆ మాటలు నమ్మదగినవిగా తోచింది, గణాచారికి. అతడు వెంటనే సరోవరేశ్వరుణ్ణి కాగుతున్న బాననీటిలోంచి బయిటికి లాగించి, అరణ్యదేవర గుడికి పోయిన బెబ్బులిదొరకు జరిగిన సంగతి చెప్పమని ఒకణ్ణి పంపి, నలుగుర్ని వెంట తీసుకుని మాయాసరోవరేశ్వరుడితో అరణ్యంలోకి బయలుదేరాడు.

వాళ్లు అరణ్యంలో సూర్యుడు పడమటి దిక్కుకు వాలేవరకూ, ఎన్నో ప్రదేశాల్లో వెతికారు. హఠాత్తుగా మాయాసరోవరేశ్వరుడికి ఒక చెట్టు కింద రథం తోలేవాడి చర్నాకోల కనిపించింది.

"నా రథచోదకుడు, యీ చెట్టుకొమ్మల్లో పడివుంటాడు!" అనుకుంటూ మాయాసరోవరేశ్వరుడు తల ఎత్తి చూశాడు. అతడికి చెట్టుకొమ్మల్లో ఎవరూ కనిపించలేదుగాని, పైన ఎగురుతూ హంసలరథం కంటబడింది.

ఆ సమయంలో పైకి లేస్తున్న పొగను గుర్తుగాపెట్టుకుని సిద్ధసాధకుడూ, మకరకేతూ కూడా నరభక్షకులున్న ప్రాంతానికి వస్తున్నారు. సిద్ధసాధకుడు తన వాహనమైన నరవానరాన్ని అదిలిస్తూ, "జై, మహాకాళా!" అంటూ పెట్టిన కేకవిని, మాయాసరోవరేశ్వరుడూ, వెంటవున్న వాళ్లూ వణికిపోసాగారు. —(ఇంకావుంది)






# ఋణవిముక్తి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నీకు జీవితంమీద విరక్తి కలిగి ఇలా శ్రమిస్తున్నావేమో నాకు తెలీదు. కాని విరక్తి కలిగినవాడికి రాసిపెట్టి ఉన్న చావు కూడా రాకపోవచ్చు. ఇందుకు నిదర్శనంగా నీకు గోపాలకుడు అనే వాడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

మహంతీపురంలో గోపాలకుడు అనే ఆగర్భ దరిద్రుడు బిచ్చం ఎత్తుకుని జీవించేవాడు. వాడి జాతకం ఎలాటిదో గాని, వాడికి ఒకపూట తిండి దొరికితే మూడు పూటలు దొరికేదికాదు.

## బేతాళ కథలు

ఒకరోజున రామానందుడనే దైవజ్ఞుడు తన శిష్యగణంతో కాశీ వెళుతూ, మహంతీపురం చేరాడు. ఆ ఊళ్ళో వాళ్ళందరూ ఆయనను అడిగి తమ తమ కష్టాలు ఎప్పుడు ఏ విధంగా తీరి పోతాయో తెలుసుకుంటున్నారు. ఈ విషయం తెలిసి గోపాలకుడు రామానందుడి వద్దకు వెళ్ళి, తన దారిద్ర్యానికి కారణమూ, నివారణో పాయమూ తెలపమన్నాడు.

''నాయనా, నువు పెట్టి పుట్టలేదు. నీ దారిద్ర్యం తీరేది కాదు,'' అన్నాడు రామానందుడు.

''స్వామీ, కనీసం నాకు చావు వచ్చి, ఈ లోకంనుంచి విముక్తి ఎప్పుడు కలుగుతుందో చెప్పండి,'' అన్నాడు గోపాలకుడు.

''పక్కనున్న పట్టణంలో రామయ్యశెట్టీ, భీమయ్యశెట్టీ, సోమయ్యశెట్టీ అనే ముగ్గురు వ్యాపారస్థులున్నారు. వారు ఒక్కొక్కరూ నీకు ఒక బంగారు మొహరు ఋణపడి ఉన్నారు. ఆ బాకీ వసూలు చేసి, దాన్ని నువు అనుభవించగానే నీకు మరణం సంభవిస్తుంది," అన్నాడు రామానందుడు.

గోపాలకుడు సంతోషంతో రామానందుడి వద్ద సెలవు పుచ్చుకుని, పట్టణం వెళ్ళి, ముగ్గురు వ్యాపారస్థులనూ కలుసుకుని, ఒక్కొక్కరినీ ఒక్కొక్క బంగారు మొహరు ఇయ్యమని అడిగాడు.



వాళ్ళు మారు మాటాడక మొహర్లు ఇచ్చారు.

గోపాలకుడు ఆ బంగారు నాణాలతో బీదలకు అన్నదానం చేసి, ''అహా, ఇవాళతో నాకు ఈ ప్రపంచం నుంచి విముక్తి కలిగింది. ఇక ఏ క్షణాన అయినా చావు రావచ్చు. చచ్చిపోయినాక నా కళేబరం ఏ వనమృగాలకైనా ఆహారం కావటం మంచిది,'' అనుకుని అరణ్యం చేరి అక్కడ సంచరించ సాగాడు.

రెండు రోజులు గడిచాయి. గోపాలకుడు ఆకలితో బాధపడటం జరిగింది. గాని, ఏ పులో, సింహమో అతన్ని చూసి తినటం జరగలేదు. దైవజ్ఞుడి మాట ఎందుకు నిజంకావటం లేదో గోపాలకుడికి అర్థంకాలేదు. అతను అలా తిరుగుతూ ఒక గోతిలో పడిపోయాడు.

''ఆహా, నా కోసం దేవుడు గొయ్యి కూడా సిద్ధంచేసి ఉంచాడు. ఇక చావు రావటమే తరవాయి,'' అనుకుంటూ అతను అంతటా కలయచూస్తూండగా చీకట్లో ఏదో తళతళా మెరిసింది. గోపాలకుడు దాన్ని తడివి, అది బంగారమని తెలుసుకున్నాడు. గోతిలో ఒక పక్క సొరంగం ఉన్నది. అందులో అంతులేని బంగారం ఉన్నది.

గోపాలకుడు ఆ బంగారాన్నంతా పోగుచేసుకుని తన ఇంటికి వచ్చి, దాని



సహాయంతో పేదల కష్టాలు తీర్చుతూ, వాళ్ళపాలిటి దైవంగా ఉంటున్నాడు. ఆగర్భదరిద్రుడైన గోపాలకుడికి అంతటి ఐశ్వర్యం ఎలావచ్చిందో ఊళ్ళోవాళ్ళకు అర్థంకాలేదు. అతను వాళ్ళకు చెప్పనూ లేదు.

మొత్తంమీద దైవజ్ఞుడి మాట నిజం కాలేదు. గోపాలకుడు చాలా కాలం బతికాడు. ఎంత బంగారం ఉన్నా అతను బీదవాళ్ళలో ఒకడుగానే బతుకుతూ వచ్చాడు. అందుచేత అతను చాలాకాలం సాటిబీదలకు సహాయపడ గలిగాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, గోపాలకుడు ఎందుకు చావలేదు? దైవజ్ఞుడు రామానందుడు చెప్పిన మాట పూర్తిగా అబద్ధం కావటానికి కారణం ఏమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రామానందుడు చెప్పిన మాట అబద్ధం కాలేదు. ఎందుకంటే, గోపాలకుడు తాను వర్తకుల నుంచి వసూలు చేసిన బాకీని తనకోసం వినియోగించుకోక దాన ధర్మాలు చేసి, తన బాకి ఇతరులకు పంచాడు. ఆ మూడు బంగారు మొహర్లనూ తానే వినియోగించుకుంటె వాడికి చావు వచ్చేదేమో. కాని వాడిలో ఉండే దానగుణం వాణ్ణి అలా చెయ్య నియ్యలేదు. చివరకు, చచ్చిపోతే తన శరీరం ఇంత బూడిద అయిపోకుండా ఏ జంతువుకో ఆహారం కావాలని వాడు కోరుకున్నాడు. ఆ విధంగా వాడికి మరింత బంగారం దొరికింది. వాడికి ఋణపడినవారి సంఖ్య అపారంగా పెరిగింది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# బలమైన శత్రువు

రంగాపురంలో రాజమ్మ పరమగయ్యాళి. ఆమె ఎప్పుడూ ఎవరివో తప్పులు వెతుకు తూండేది. దానికి తోడు ఆమె నోరు కూడా చాలా పెద్దది. అయితే తన కొడుకు వీరయ్య అంటే మాత్రం ఆమెకు చాలా ఇష్టం. ఆమె అతన్ని చాలా ప్రేమతో, ముద్దుగా పెంచింది. కాని ఆమె నోరు మంచిది కాకపోవటాన, వీరయ్యకు పిల్లనియ్యడానికి ఎవరూ ముందుకు రాలేదు.

ఒకసారి వీరయ్య ఏదో పనిమీద దూర గ్రామానికి వెళ్లి, ఆ ఊరి చెరువు దగ్గిర ఒక అందమైన అమ్మాయిని చూసి, మతి పోయినట్టయి, మారు ఆలోచన లేకుండా ఆ పిల్లను అనుసరించి వాళ్లింటికి వెళ్ళాడు. ఆ పిల్లకు కూడా అతను నచ్చినట్టే కనబడింది.

వీరయ్య ఆ పిల్ల పేరు ఇందిర అని తెలుసుకుని, ఆమెను పెళ్ళాడాలని తనకు ఉన్నట్టు ఆమె తల్లిదండ్రులతో చెప్పాడు.

"చూడు, నాయనా! నీకు ముందే తెలియటం మంచిది. మా పిల్ల పరమ గయ్యాళి. అందుకే దానికి ఒక పట్టాన సంబంధం కుదరకుండా ఉన్నది. ఇష్టమైతేనే పెళ్ళాడు," అన్నారు ఇందిర తల్లిదండ్రులు వీరయ్యతో.

వీరయ్య వాళ్ళకు తన తల్లి గురించి చెప్పాడు. అలాటి అత్తద్వారానైనా తమ కూతురి బుద్ధి మారుతుందని ఆశపడి, వాళ్లు అతనికి ఇందిర నిచ్చి పెళ్ళిచేశారు.

భార్యను వెంటబెట్టుకుని వచ్చిన వీరయ్యను చూసి రాజమ్మ తెల్లబోయినా, ఎవరో ఒకరు తన కొడుక్కు పిల్ల నిచ్చారని సంతోషించింది. పిల్ల అందంగా కూడా ఉన్నది. ఒక నెలపాటు ఆమె




వేళ్ళాడేవాడు పెళ్లి ఎందుకు చేసుకోవాలని అడిగింది ఇందిర.

వీరయ్యకు అది మొదలు ఇల్లు నరకమైపోయింది. అతను మెతక మనిషి. వాళ్లిద్దరి మధ్యా నలగటం ఇష్టంలేక, అతను ఇద్దరి మాటలూ పట్టించుకోకుండా ఉండడం అలవాటు చేసుకున్నాడు.

ఒకసారి వీరయ్య కామందుగా రబ్బాయిని పాముకాతపడకుండా కాపాడాడు. కామందు అతన్ని మెచ్చుకుని, తన కున్న పాడిపశువుల్లో ఒకటి తోలుకు పొమ్మన్నాడు. వీరయ్య ఈ సంగతి ఉత్సాహంగా ఇంట్లో చెప్పాడు.

''గోమాత ఇంటికి రావడం శుభం!'' అన్నది రాజమ్మ.

''గేదెను తోలుకొచ్చుకుందాం. చిక్కని పాలిస్తుంది,'' అన్నది ఇందిర.

అది చిలికి చిలికి గాలివాన అయింది. వీరయ్యకు మతిపోయింది. వాళ్ళ వాదన ఆగిపోతుందేమోనని చూశాడు, కాని అది ఆగలేదు. రాజమ్మ ప్రపంచంలోగల గేదెలన్నిటినీ తిట్టి పోస్తున్నది, ఇందిర ఆవులన్నిటినీ దుమ్మెత్తి పోస్తున్నది.

మర్నాడు వీరయ్య పొలంలో కనిపించినప్పుడు కామందు, ''నిన్న వచ్చి పశువును తోలుకు పోలేదేం?'' అని అడిగాడు. వీరయ్య తన చిక్కు చెప్పాడు.

కొడుక్కూ, కోడలుకూ ఏ లోటూ రానీకుండా అడ్డమైన చాకిరీ చేసింది. తరవాత ఆమెకు, తన చాకిరీవల్ల కోడలు కూడా సుఖపడుతున్నదని తెలిసివచ్చి, ఆమెకు కూడా పనులు చెప్పసాగింది.

ఒకరోజు వీరయ్య పొలం నుంచి ఇంటికి వచ్చేసరికి వంట సిద్ధంగా లేదు. అత్త కోడలుమీదా, కోడలు అత్తమీదా వందలకొద్దీ నేరాలు చెప్పారు అతనికి. అతను ఇద్దరినీ మందలించబోగా, ఇద్దరూ అతనిమీద విరుచుకు పడిపోయారు. పెళ్ళాం బెల్లమైపోయిందని తల్లి ఆక్షేపించింది. తల్లి కొంగుపట్టుకుని

''నా గేదెలన్నిటినీ సంతకు తోలే శాను. ఆవులు మాత్రమే ఉన్నాయి. ఒక ఆవును తోలుకు వెళ్లు,'' అన్నాడు కామందు వీరయ్యతో.

తన సమస్య ఈ విధంగా పరిష్కార మైనందుకు సంతోషించి, ఈ మాట ఇంట్లో చెప్పాడు. రాజమ్మ సంతోషించి, 'మనింటికి గేదె రాకుండా దేవుడే కాపాడాడు,'' అన్నది.

''గేదెను తెచ్చుకునే అదృష్టం అందరికీ ఉంటుందా ?'' అన్నది ఇందిర. అత్త కోడలిమీద లేచింది. కోడలు అత్తకు ఏమీ తగ్గలేదు.

వాళ్ళ గొడవ ఇప్పట్లో తగ్గదని తెలిసి వీరయ్య, ''నేను వెళ్ళి ఆవును తోలు కొస్తున్నాను,'' అన్నాడు.

''ఆ తోలుకొచ్చేది నల్ల ఆవుగా చూసి తోలుకు రండి. రంగైనా చూసి తృప్తి పడవచ్చు,'' అన్నది ఇందిర.

''శుభమా అని పాడిపశువును తెచ్చు కుంటూ నల్ల రంగేమిట్రా ? తెల్ల రంగు శుభం ! తెల్ల ఆవును తోలుకురా,'' అన్నది రాజమ్మ.

మళ్ళీ అత్తా కోడళ్ళ మధ్య రంధి పెరిగింది. ''నల్ల రంగును తిట్టి పోస్తున్నావు. నువు నల్లగా లేవా ?" అని ఇందిర అత్తను అడిగింది.



''నువు తెలుపును ఏమని తిట్టి పోస్తు న్నావు ? నువు తెల్లగా లేవా ?'' అని అత్త కోడల్ని అడిగింది.

''తెల్లగా ఉంటే ఉరేసుకునేదాన్ని ! నా రంగు పచ్చని పసిమి !'' అన్నది ఇందిర.

వాళ్ళ గొడవ ఇంతలో తేలదని, వీరయ్య అన్నం వడ్డించుకుని తినేసి, నిద్రపోయాడు.

రాలేదేమని వీరయ్యను కామందు మళ్ళీ మర్నాడు అడిగాడు. వీరయ్య తన ఇబ్బందిని చెప్పుకున్నాడు.

''నాకు అత్తాకోడళ్ళ బాధలేదు గాని, ఇద్దరు పెళ్ళాలున్నారు. వాళ్లు మొదట్లో

ఇలాగే కొట్లాడుకునే వాళ్లు. చివరకు మంచి ఉపాయం పన్ని, ఇద్దరికీ సఖ్యత కలిగించాను,'' అన్నాడు కామందు.

''ఆ ఉపాయ మేదో నాకూ చెప్పండి, బాబూ!" అన్నాడు వీరయ్య.

''ఇద్దరు శత్రువులు ఏకం కావాలంటే వాళ్ళకు తమకన్న బలమైన శత్రువు దాపరించాలి!'' అన్నాడు కామందు.

''వాణ్ణి ఎక్కడ వెతికేది, బాబూ?'' అన్నాడు వీరయ్య.

''నువే!'' అన్నాడు కామందు నవ్వుతూ.

తను ఏం చెయ్యాలో వీరయ్య గ్రహించాడు. అతను ఆ సాయంత్రం కామందు ఇంటినుంచి ఎర్ర అవును తోలుకుని వెళ్లాడు. అత్తా కోడళ్లు ఇద్దరూ ఆ అవును చూస్తూనే అతని మీద విరుచుకుపడ్డారు.

''బతికి నన్నాళ్లు బతకవు. చిన్న వాళ్ళను శాపనార్థాలు పెడతావు, బుద్ధి లేదూ?'' అని వీరయ్య తల్లిని నానా మాటలూ అన్నాడు.

మొగుడు తన పక్షం అవుతాడని ఆశపడి ఇందిర మరింత నోరు ఝాడించింది.

''నీ పని ఏదో నువు చూసుకో. మగ వాళ్ల వ్యవహారాల్లో జోక్యం చేసుకోకు. కామందు అవు నిస్తా నన్నాడు. నాకు నచ్చిన అవు నేను తెచ్చుకున్నాను. దీన్ని గురించి ఏమైనా మాట్లాడావంటే, దీన్ని బాదినట్టే నిన్నూ బాదుతాను," అన్నాడు వీరయ్య పెళ్ళాంతో.

అతను అలా రెండురోజులపాటు తల్లిని కొట్టినంత పనిచెయ్యటమూ, పెళ్ళాన్ని నిజంగానే కొట్టటమూ చేసే సరికి, ఆడవాళ్ళిద్దరూ సఖ్యమయారు. వాళ్లకు వీరయ్య అంటే భయం పట్టుకున్నది. అతను ఇంట్లో ఉన్నంతసేపూ కుక్కిన పేలలా ఉండి, బయటికి వెళ్లగానే అతనిమీద ఒకరికొకరు చాడీలు చెప్పుకునేవారు. ఇద్దరి మధ్యా అన్యోన్యత ఏర్పడింది.



# లోగుట్టు

చాలాకాలం తరవాత స్వగ్రామానికి పనిమీద వచ్చిన వీరాస్వామికి అతని ప్రాణమిత్రులు భూపతీ, రంగధాముడూ కనిపించి, తమ ఇంట ఉండమని నిర్బంధించారు. ఇద్దరి ఇళ్ళలోనూ రెండేసి రోజులు ఉండటానికి వీరాస్వామి ఒప్పుకున్నాడు.

ముందు అతను భూపతి ఇంట బసచేశాడు. భూపతీ, అతని భార్య అలివేలూ అతన్ని చక్కగా చూశారు. అయితే ఎందుచేతనో భూపతి వీరాస్వామిని ఒంటిగా తన ఇంట వదలక, తాను వెళ్ళిన చోటికెల్లా అతన్ని కూడా తిప్పాడు. తరవాత, పక్కనే ఉన్న రంగధాముడి ఇంటికి మారినప్పుడు కూడా రంగధాముడి భార్య చూడామణి అతన్ని ఎంతో ఆదరించింది. కాని రంగధాముడు కూడా వీరాస్వామిని రోజల్లా తన వెంటనే తిప్పాడు.

ఈ రహస్యం ఏమిటో తెలుసుకోవాలని వీరాస్వామి రంగధాముడికి ఏదో సాకు చెప్పి, అతన్ని విడిచి అతని ఇంటికి తిరిగి వచ్చేసరికి, పెరట్లో అతని మిత్రుల భార్యలిద్దరూ హోరాహోరీ పోట్లాడుకుంటున్నారు!

ఆ సంగతి అతను తన మిత్రులకు చెబితే, ఇద్దరూ సిగ్గుపడి తలలు వంచుకున్నారు.

"మీ రిద్దరూ పనిమనుషులను తీసేసి మీ భార్యలకు ఊపిరి సలపని పని కల్పించండి. వాళ్ళకు పోట్లాడే తీరికలేకుండా చేస్తే వాళ్ళే మారతారు," అని వీరాస్వామి తన స్నేహితులకు సలహా ఇచ్చాడు. ఆ సలహా చక్కగా పనిచేసింది. —గుండాల విజయ.





# అపాత్ర దానం

ఒక ఊళ్ళో గంగయ్యా, దుర్గయ్యా అని ఇద్దరు ధాన్యపు వర్తకులు కలిసి వ్యాపారం చేసేవారు. వాళ్ళు ఏళ్ళతరబడి ఎంతో సఖ్యంగా, ఎలాటి అభిప్రాయ భేదాలూ లేకుండా మసలటం చూసి, ఎవరన్నా అన్నదమ్ముల మధ్య పోట్లాటలు వస్తే, ఊరి పెద్దలు, "గంగయ్యా, దుర్గయ్యలను చూసి అయినా బుద్ధి తెచ్చుకోండి !" అని మందలించే వాళ్లు.

ప్రతి ఏడూ సంక్రాంతికి ఈ మిత్రులిద్దరూ తమకు వచ్చిన లాభాలు పంచుకునేవారు. ఆ సమయంలో రంగయ్య తన వంతు లాభంలో నుంచి మూడు వందల అరవై అయిదు రూపాయలు విడిగా తీసి మూటగట్టేవాడు. అయితే దుర్గయ్య అతన్ని ఎన్నడూ. "ఆ డబ్బు అలా ఎందుకు మూట గట్టుతున్నావు ?" అని అడగలేదు. అది రంగయ్యకే ఆశ్చర్యంగా ఉండేది.

ఏటా ఆ ఊరి పొలిమేరల్లో సంత జాతర జరిగేది. ఆ సందర్భంలో సంతతో బాటు, జూదమూ, తాగుడూ కూడా చురుకుగా సాగేవి. సంతకు కొద్ది దూరంలో ఒక దిబ్బ ఉండేది. ఆ దిబ్బ మీద ఒక బావీ, చుట్టూ ఎత్తుగా, ఏపుగా పెరిగిన చెట్లూ ఉండేవి. ఆ ప్రదేశం ప్రయాణీకుల విశ్రాంతికీ, భోజనాలకూ చాలా అనుకూలంగా ఉండేది. మూడు వందల అరవై అయిదు రూపాయలు విడిగా మూటగట్టిన గంగయ్య ఎవరూ చూడకుండా ఆ బావి దగ్గిర పెట్టి పోతూండేవాడు. అది ఎవరు తీసుకుపోయేదీ అతనికి తెలీదు.

కాని ఒక ఏడు తన గుప్తదానం ఎవరికి దక్కుతున్నదీ తెలుసుకోవాలనిపించి, గంగయ్య బావివద్ద నుంచి

---

ఎమ్. డి. సౌజన్య

వెళ్ళిపోయినట్లే పోయి, మళ్ళీ తిరిగి వచ్చాడు. ఎవరో వ్యక్తి పైపంచ తల మీదినుంచి కప్పుకుని, చెట్లచాటుగా వెళ్లుతూండటం గంగయ్యకు కనిపించింది. గంగయ్య వదిలిన డబ్బు సంచీ బావిదగ్గిర లేదు.

ఆ మనిషే తన డబ్బు సంచి తీసి ఉంటాడని గంగయ్య అతన్ని వెంబడించాడు. ఆ వ్యక్తి దుర్గయ్యేనని త్వరలోనే తెలిసిపోయింది.

''నా డబ్బు ఏ పేదవాడికన్నా దొరికి, వాడు లాభంపొందా లనుకుంటే, అది నీకా దొరికింది ?'' అన్నాడు గంగయ్య బాధగా.

దుర్గయ్య నవ్వుతూ, ''నువు పారేశాక ఈ డబ్బు ఎవరికి దొరికితే నీకేం ?'' అన్నాడు.

''డబ్బు నే నిలా ఎందుకు పారేస్తున్నానో తెలిస్తే నువ్విలా అనవు,'' అని గంగయ్య తన కథ ఇలా చెప్పాడు:

''నాకు పసితనంలోనే తల్లిదండ్రులు పోయారు. పేదవాణ్ణి. పొట్ట పోసుకునేందుకు అంత చిన్న వయసులోనే రకరకాల పనులు చెయ్యవలసి వచ్చింది. ఒకసారి కరువు వచ్చి, మా ఊరి నుంచి జనం అన్నివైపులా పారిపోయారు. నేను ఈ ఊరు వచ్చాను. ఇక్కడ పెద్ద సంతా, జాతరా జరుగుతున్నది. ఆ రోజు సంక్రాంతిట. నాలుగు రోజులుగా తిండిలేదు. యాచన లాభించ





లేదు. ఒక మిఠాయి కొట్లో లడ్డూలు రెండు దొంగిలించి, పట్టుబడి, చావు దెబ్బలు తిన్నాను. ఆకలి బాధా, అసహాయతా మూలంగా చావాలనిపించి, ఈ బావి దగ్గిరికి వచ్చాను. బావిలోకి దూకబోతూండగా నా కాలికింద ఏదో తగిలింది. ఎర్రరాళ్ళుగల బంగారు ఉంగరం! అంతే! నాకు జీవితంమీద మళ్ళీ ఆశ పుట్టింది. ఆ ఉంగరం అమ్మి ఒక పాడి గేదెను కొన్నాను. దానిమీద ఆదాయంతో ఒక ఎద్దుబండి కొన్నాను. తరవాత నువు కలిశావు. ధాన్యపు వ్యాపారంలో ఇద్దరం పైకి వచ్చాం. ఏ రోజున నాకు బావి దగ్గిర ఉంగరం దొరికిందో అదే సంక్రాంతి రోజున ఆ బావిదగ్గిరే మూడువందల అరవైఅయిదు రూపాయలు గుప్తంగా వదిలేస్తున్నాను."

అంతా విని దుర్గయ్య, "నీ అభిప్రాయం మంచిదే కావచ్చు. కాని నీ డబ్బు దొరికినవాడి బుద్ధి వక్రించే అవకాశం లేకపోలేదు. మనం ప్రత్యక్షంగానే చూడవచ్చు," అన్నాడు. అతను ఆ డబ్బు సంచీని పెద్ద సంచీలో పెట్టి, గంగయ్యతో బావివద్దకు తిరిగి వచ్చాడు. ఇద్దరూ కలిసి ఒక పెద్ద చెట్టెక్కారు.

దుర్గయ్య తన పెద్ద సంచీ నుంచి ఒక చిన్న సంచీ తీసి, బావి దగ్గర పడేటట్టు విసిరాడు. కొద్ది సేపటికి నిలువునా కాషాయబట్టలు ధరించిన తెల్లగడ్డపు సాధువు తాను అడుక్కు తెచ్చుకున్న అన్నపు మూట బావిగట్టున పెట్టి, కాళ్లు కడుక్కోవటానికి, బొక్కెన ఎత్తుతూండగా దుర్గయ్య విసిరేసిన మూట కనబడింది.

వెంటనే అతనిలో చిత్రమైన మార్పు వచ్చింది. తాను పాడుతున్న భక్తిపదం ఆపి, అతను చుట్టూ ఎవరూ లేరుగదా అని చూసి, ఆ మూటను తన జోలెలో వేసుకుని, ''ఇన్నాళ్ళకు ఈ వెధవ బ్రతుకునుంచి విమోచనం కలిగింది! ఇకనైనా పెళ్ళాడి సుఖపడతాను,'' అని

పైకే స్వగతం చెప్పుకుంటూ, తాను తెచ్చుకున్న తిండి సంగతి కూడా మరిచిపోయి, వెళ్ళిపోయాడు.

''అంతా వదిలేసి సర్వసంగ పరిత్యాగం చేసిన సాధువుకు ఈ వయసులో పెళ్ళా!'' అని గంగయ్య ఆశ్చర్యపోయాడు.

దుర్గయ్య మాట్లాడవద్దని సైగచేశాడు. అతను ఒక వెండి రూపాయి తీసి బావి గట్టు దగ్గిర పడేటట్టు విసిరేశాడు.

కొద్దిసేపటికి ఇద్దరు జూదరులు ఒకరినొకరు తిట్టుకుంటూ బావి దగ్గిరికి వచ్చారు.'' పాడి గేదెను కొందామని తెచ్చిన డబ్బు, నీ మాటలు విని, జూదంలో తగలేశాను. చిల్లిగవ్వ మిగల్లేదు. ఇంటికి ఏ ముఖం పెట్టుకు పోయేది ? ఇంతకన్న ఈ బావిలో దూకి చచ్చేది మేలు,'' అంటూ ఒకడు బావికేసి పరిగెత్తాడు. రెండోవాడు వాణ్ణి వారించే ప్రయత్నంలో ఉండగా మొదటివాడికి రూపాయి కనిపించింది. వెంటనే వాడు ఆ రూపాయి చేతిలోకి తీసుకుంటూ,'' సమయానికి దొరికింది! ఈ రూపాయతో పోయిన డబ్బు అంతా తిరిగి వస్తుందేమో ! ఎవరు చూశారు?'' అంటూ వాడు జూదశాలలవైపు పరిగెత్తాడు.

''అందులో నాకు సగం వాటా ఉన్నది,'' అంటూ రెండోవాడు మొదటివాడి వెనక పరిగెత్తాడు.



గంగయ్య దుర్గయ్యతో, "ఇదేమిటి ? ఎంతో డబ్బు జూదంలో పోగొట్టుకున్నందుకు ఏడుస్తున్నవాడు, ఒక్క రూపాయి దొరకగానే మళ్ళీ జూదం ఆడటానికి పరిగెత్తాడు," అన్నాడు.

దుర్గయ్య మాట్లాడలేదు.

మరి కొంచెంసేపటికి ఒక కట్టెలమోపు వాడు బావికేసి వస్తూ కనిపించాడు. దుర్గయ్య ఒక చిన్న డబ్బుల సంచీ తీసి, కట్టెలవాడికీ, బావికీ మధ్య దారిలో పడేటట్టు విసిరాడు.

కట్టెలవాడు, "ఈ కట్టెలు అమ్మేదెప్పుడు? ఇంటికి చేరి, గంజి కాచుకునేదెప్పుడు ?" అనుకుంటూ కట్టెలమోపు దింపి, బొక్కెనతో నీళ్ళు తోడి తాగి, మోపు ఎత్తుకుని సంత కేసి వెళ్లాడు.

"ఇదేమిటి ? దారిలో డబ్బు సంచీ పడి ఉంటే దానికేసి చూడనైనాలేదు !" అన్నాడు గంగయ్య,

"నీ గుప్తదానం అపాత్రులకు దొరికి ఎంత హాని చేసిందో చూశావా ? శ్రమ పడకుండా, అయాచితంగా దొరికే డబ్బు విలువ తెలిసినవాళ్లు చాలా అరుదు. వయసు మళ్ళిన సాధువుకు డబ్బు మూట చూడగానే బుద్ధి వక్రించింది. ఆ మూటలో ఉన్నది చిల్లపెంకులని కూడా చూసుకోకుండా వాడు సుఖాల మీదికి దృష్టి మళ్ళి వెళ్ళాడు. అలాగే రూపాయి చూడగానే జూదగాడికి కలిగిన జ్ఞానోదయం కాస్తా పోయింది. నిజంగా డబ్బుతో బాగుపడే అర్హతగల వాడికి తేరగా వచ్చే డబ్బు దృష్టే లేదు. కట్టెల వాడు తన శ్రమ ఫలితంమీదే ఆశలు పెట్టుకున్నాడు !" అన్నాడు దుర్గయ్య.

"అయితే నేను ఇన్నేళ్ళూ చేసిన గుప్తదానం బూడిదలో పోసిన పన్నీరేనా ?" అన్నాడు గంగయ్య. ఎంతో విచారపడిపోతూ.

"లేదు, అదంతా నేను తీసి భద్రం చేస్తూ వచ్చానులే. దానితో శాశ్వతంగా మన పేర ఒక పాఠశాల ఊళ్లో కట్టిద్దాం," అన్నాడు దుర్గయ్య.





# దొంగలూ - స్వాములూ

చిన్నడు తన - కుక్కతో రామాపురం నుంచి బయలుదేరి, గంగాపురం చేరే సరికి, బాగా చీకటిపడింది. వాడికి ఆకలితోబాటు దాహం కూడా వేస్తున్నది. ఝామురాత్రి కూడా దాటకపోయినా వీధులు నిర్జనంగా ఉన్నాయి, ఇళ్ళ తలుపులన్నీ మూసి ఉన్నాయి. మంచి నీళ్లకోసం వాడు ఒక ఇంటి తలుపు తట్టే సరికి, లోపలినుంచి వినబడుతున్న మాటలు టక్కున ఆగిపోయాయి.

వాడు మరో ఇంటి ముందుకు వెళ్ళి, తలుపు తట్టకుండా, తలుపు సందుల్లో నుంచి లోపలికి చూశాడు. లోపల మసక వెలుగులో గొంతుదాకా కప్పుకుని, ఇద్దరు ఎదురు మదురుగా కూర్చుని, ఏదో మాట్లాడుకుంటున్నారు.

''అయ్యా, దాహంగా ఉన్నది. కాసిని మంచినీళ్ళు ఇప్పించండి!'' అని చిన్నడు దీనంగానే అడిగాడు. వెంటనే లోపలివాళ్ళు పడుకుని, నిండా కప్పుకున్నారు.

అప్పుడే గ్రామస్థులు తలుపులు బిడాయించుకున్నారంటే ఈ ఊరి వాళ్ళను కూడా ఏదో భయం పట్టుకుని ఉండాలనుకుని చిన్నడు నిర్జనమైన వీధులకుండా నడిచి ఒక దేవాలయాన్ని చేరుకున్నాడు.

మంటపంలో ముగ్గురు మనుషులు కూర్చుని ఉన్నట్టు చీకట్లో లీలగా కనిపించింది. చిన్నడు ఆశగా వారిని సమీపించాడు, కాని వాళ్లను చూసి చిన్నడి కుక్క గుర్రుమన్నది.

వాళ్ల ముగ్గురిలో ఒకడు గంజాయి దమ్ము కొడుతున్నాడు. మిగిలిన ఇద్దరూ మాంసం నంజుకుంటూ సారా తాగుతున్నారు. దమ్ము కొట్టేవాడు చిన్నణ్ణి

బూర్లె నాగేశ్వరరావు



చూసి, ''ఎవడ్రా నువు ?'' అని అడిగాడు.

''దాహంగా ఉన్నది, ముందు కాసిని మంచినీరిప్పించండి. తరవాత నింపాదిగా అన్నీ చెబుతాను,'' అన్నాడు చిన్నడు.

''రేయ్, మాకు మంచినీళ్లు ఎట్లా ఉంటాయో తెలీదు. సారాయి తప్ప తాగి ఎరగం. దాహంగా ఉన్న వాడికి తాగటానికి ఇయ్యటం ధర్మం. ఇదుగో సీసా! గొంతు కాస్త తడి చేసుకో !'' అన్నాడు మరొకడు.

చిన్నడు జవాబు చెప్పకుండా అక్కడి నుంచి కదిలి, ఆ రాత్రికి ఎక్కడో పడుకుని నిద్రపోయాడు.

మర్నాడు ఉదయం వాడు నిద్ర లేచేసరికి, ఊరంతా చాలా సందడిగా ఉన్నది. జనం అమిత ఉత్సాహంతో గుంపులు, గుంపులుగా ఎక్కడికో వెళుతున్నారు. చిన్నడు వాకబు చెయ్యగా కారణం తెలిసింది.

ఆ రోజు శుక్రవారం గనక ప్రజలకు స్వామీజీ దర్శనం కలుగుతుంది. నాలుగు వారాల క్రితం ఆ యోగి తన శిష్యులతో ఆ ఊరు వచ్చాడు. ఆయన మామూలు యోగి కాదు, సప్తలోక సంచారి, త్రికాలవేది. ఆయన ఊరి బయట, మర్రిచెట్టు కింద పీఠంవేసి ఉన్నాడు, శుక్రవారం తప్ప మిగిలిన రోజులు యోగసమాధిలో ఉంటాడు. శుక్రవారంనాడు ప్రజలు ఆయన పాద ధూళి తీసుకుని, తమ కోరికలు విన్నవించుకుంటారు. ఆ కోరికలు ఎలా తీరేదీ, ఎప్పుడు తీరేదీ దేవతలతో సంప్రతించిగాని ఆయన చెప్పడు.

ఇదంతా చిన్నడికి నమ్మశక్యం కాలేదు.

''అదంతా బాగానే ఉందిగాని, ఈ ఊళ్లో వాళ్లు చీకటి పడీ పడకుండానే తలుపులు బిగాయించుకుంటారేం ?'' అని వాడు అడిగాడు.

ఊళ్ళో దొంగల బెడద ఎక్కువగా ఉన్నదనీ, ఆ దొంగలు రాక్షసు లంత క్రూరులనీ, అవలీలగా ప్రాణాలు తీస్తారనీ, స్వామీజీ కూడా వాళ్లను ఏమీ చెయ్యలేకపోతున్నాడనీ, ఎందుకంటే వాళ్లు రావణ జాతికి చెందినవారనీ, వాళ్ళతో విరోధం చావు తెచ్చిపెట్టుకోవటమేనని స్వామీజీకి దేవతలే చెప్పారనీ, ఈ దొంగలను గురించి స్వామీజీకీ, దేవతలకూ పెద్ద ఘర్షణ జరుగుతున్నదనీ చిన్నడు విన్నాడు.

ఊరి జనంతోబాటు చిన్నడు కూడా స్వామీజీని చూడబోయాడు. స్వామీజీ యోగ సమాధిలో ఉన్నాడు. చేతిలో రుద్రాక్షమాలా, పక్కనే కమండలమూ ఉన్నాయి. ఆయన వెంట బలమైన శిష్యులు కూడా ఉన్నారు. అందరికీ మూరెడేసి గడ్డా లున్నాయి. అందరూ కాషాయదుస్తులు ధరించి ఉన్నారు.

జనం ఒకరొకరే స్వామీజీని సమీపించి ఏవో అడుగుతున్నారు. స్వామీజీ చిరునవ్వుతో సమాధానం చెప్పి, తిరిగి కళ్ళు మూసుకుంటున్నాడు. చిన్నడు తన కుక్కతో సహా వెళ్లి, స్వామీజీకి దణ్ణం పెట్టి నిల్చున్నాడు. వాడి కుక్క స్వామీజీ శిష్యులను చూసి గుర్రుమన్నది. వెంటనే వాళ్లు కళ్లు మూసుకుని



ఏవో మంత్రాలు జపించారు. స్వామిజీ కళ్ళు తెరిచి చిన్నడి కేసి తీవ్రంగా చూశాడు. "క్షమించు, స్వామీజీ! కుక్క కేమీ తెలీదు," అన్నాడు చిన్నడు చెంపలు వేసుకుంటూ.

"నీకు ఏం కావాలి, నాయనా?" అని స్వామీజీ అడిగాడు.

చిన్నడు "పెళ్ళిచేసుకోవాలని కోరికగా ఉన్నదండీ!" అన్నాడు.

శిష్యులు గురువు కేదో సంకేతం అందజేశారు. స్వామీజీ వెంటనే చిరునవ్వు నవ్వి, "చాలా చిన్న కోరిక! ఫరవా లేదు. నీ పెళ్ళి స్వయంగా నేనే జరిపిస్తాను, వెళ్లు!" అన్నాడు.



అడగడం పూర్తి అయినాక జనం మౌనంగా కూర్చున్నారు. స్వామీజీ మాట్లాడటానికి లేచి నిలబడ్డాడు. అతను ఇలా అన్నాడు :

"ఊళ్లో దొంగలను గురించి దేవతలతో నేను జరిపిన చర్చలు పూర్తి అయాయి. దేవతలు గ్రామాన్ని దొంగల బారినుండి కాపాడటానికి ఒప్పుకున్నారు. అయితే వచ్చే శుక్రవారందాకా దొంగలను భరించక తప్పదు. ఆ తరవాత దొంగలు ఈ ఛాయల కనిపించరు. మనకు మంచిరోజులు వస్తాయి. ఇదే దేవతల నిర్ణయం !''

తరవాత జనం లేచి, తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. చిన్నడి బుర్ర చాలా చురుకుగా పనిచేస్తున్నది. స్వామీజీ ఆడేది నాటకమని తేలిపోయింది.

ఆ రాత్రి మర్రిచెట్టుకు కొంతదూరంలో ఉన్న పెద్ద బండచాటున చిన్నడు మాటు వేసి దాగాడు. అర్ధరాత్రి కాగానే ముగ్గురు దృఢకాయులు పెద్ద పెద్ద మూటలతో స్వామీజీ దగ్గిరికి రావటం వాడికి కనిపించింది, వాడు పిల్లిలా కదులుతూ చెట్టుచాటుకు చేరాడు. మూటలు తెచ్చిన వాళ్లు గతరాత్రి వాడు చూసిన దొంగలే. వాళ్ళే స్వామీజీకి శిష్యులు కూడా.

వాళ్లను చూస్తూనే స్వామీజీ లేచి, తాను కూర్చున్న పీఠంమీది మూత తొలగించాడు. వాళ్లు తెచ్చిన వెండీ, బంగారమూ, డబ్బూ పీఠంలో వేసి, తిరిగి మూత పెట్టేశాడు. తరవాత అందరూ మాంసం తింటూ, సారా తాగసాగారు.

ఇదంతా చూసిన చిన్నడి రక్తం వేడెక్కింది. కాని తాను తొందర పడితే, స్వామీజీ చెప్పినట్టు, తన పెళ్లి వెంటనే జరిగిపోతుంది! వాడు మెల్లిగా అక్కడి నుంచి జారుకుని ఊరు చేరుకున్నాడు.

చిన్నడు తన కార్యక్రమం గురించి తీవ్రంగా ఆలోచించాడు. స్వామీజీ దొంగ

అంటె ప్రజలు నమ్మరు. పై పెచ్చు తనను చావగొట్టవచ్చు కూడా! అందు చేత ప్రజల అమాయకత్వాన్ని ఆధారం చేసుకుని నాటకం ఆడాలి.

తెల్లవారగానే చిన్నడు ఇంటిఇంటికీ వెళ్ళి, "ఈ రోజు స్వామీజీని చూడ టానికి హిమాలయాల నుండి ఎందరో యోగులూ, జోగులూ వస్తున్నారట! వాళ్ళకోసం పాకలూ, పందిళ్ళూ విశేషంగా వెయ్యాలి అని స్వామీజీ ఆజ్ఞ! అందుచేత మీరు పలుగులూ, పారలూ పట్టుకుని వెంటనే బయలుదేరండి. ఆలస్యం చేస్తే స్వామీజీకి ఆగ్రహం వస్తుంది,'' అని చెప్పాడు.

ఎన్నడూ లేనిది, గ్రామస్థులందరూ పలుగులూ, గడ్డపారలూ తీసుకుని, కోలాహలంగా తన కేసి రావటం చూసి స్వామీజీ, అతడి శిష్యులూ తత్తర పడ్డారు. అందరికీ ముందుగా చిన్నడు తన కుక్కతోసహా వస్తూండటం చూసి స్వామీజీకి కంపరం పుట్టుకొచ్చింది. చూస్తూండగానే ప్రజలు స్వామీజీ బృందం చుట్టూ చేరారు. స్వామీజీ తమను చూసి గజగజ లాడిపోవటం గమనించి ప్రజలు నిర్ఘాంతపోయారు.

చిన్నడు ఆలస్యం చెయ్యకుండా, ''స్వామీజీ, మీ సంగతంతా వీళ్ళకు తెలిసిపోయింది. మిమ్మల్ని పాతెయ్య టానికి పలుగులూ, పారలూ తెచ్చారు," అంటూ స్వామీజీగడ్డం పట్టుకులాగాడు. అది కాస్తా వాడి చేతిలోకి ఊడి వచ్చే సింది. తరవాత వాడు స్వామీజీ శిష్యుల గడ్డాలు కూడా ఊడబీకాడు.

ఇది చూసి ప్రజల కోపం కట్టలు తెంచుకున్నది. వాళ్లు దొంగస్వాములను పట్టుకుని చితక తన్నారు. చిన్నడు వాళ్ళను వారించి, పీఠంలో ఉన్న నిధి అంతా గ్రామపెద్దలకు చూపించి, ఊళ్లో ఎవరి నగలు వారికి తిరిగి దక్కే ఏర్పాటు చేశాడు. స్వామీజీ, శిష్యులూ కారాగృహాలకు వెళ్ళగానే, చిన్నడు తన కుక్కతోసహా గంగాపురం వదిలి వెళ్ళిపోయాడు.






# పరాకు పెళ్లాం - చిరాకు మొగుడు

ఈశ్వరయ్యకు తగని చిరాకు. అతని భార్య సుందరమ్మ పరాకు మనిషి. భార్య పరాకువల్ల ఈశ్వరయ్య చిరాకు మరింత అయింది.

ఒకనాడు తెల్లవారుతూనే ఈశ్వరయ్య తన పెళ్ళాన్ని బిగ్గరగా కేకవేశాడు. వంట ఇంట్లో, పొయ్యిమీద పాలు పొంగి పోతున్నా గమనించకుండా, పరాకుగా కూర్చుని ఉన్న సుందరమ్మ వినిపించుకో లేదు. ఈశ్వరయ్య కోపంతో చిందులు తొక్కుతూ వంటగదిలోకి వచ్చి, "నీ పరాకుతో నా ప్రాణాలు తీసేస్తున్నావు. ఈ పూట నేను ఊరికి పోతున్నాను. నాకు వంట చెయ్యకు. నేను చీకటిపడి తిరిగి వస్తాను," అన్నాడు.

సుందరమ్మ సరేనన్నట్టు తల ఆడించి, మరి కాస్సేపటికే భర్తవద్దకు వెళ్ళి, "ఈ పూట ఏం కూరచెయ్యను?" అని అడిగింది.

ఈశ్వరయ్యకు ఒళ్ళు మండిపోయి, "నా తలకాయకూర చెయ్యి! నేను ఊరికి పోతున్నానని ఇప్పుడే గదా చెప్పాను. ఆ చేసేదేదో రాత్రికి చెయ్యి," అని, వెళ్ళిపోయాడు.

మొగుడు వెళ్ళిపోయాక సుందరమ్మ తనకు కావలసిన దేదో చేసుకు తిని, సాయంత్రందాకా నిద్రపోయింది. తరవాత ఆమె నాలుగిళ్ళ అవతల ఉన్న కామాక్షమ్మ గారింటికి, కాలక్షేపంకోసం వెళ్ళింది.

"నీ మొగుడు ఊళ్ళో లేడన్నావుగా? ఈ పూట మా ఇంట్లోనే భోజనం చేసి పడుకో," అన్నది కామాక్షమ్మ.

భర్త వస్తాడన్నమాట మరిచిపోయి, సుందరమ్మ అక్కడే భోజనం చేసి, పడుకున్నది. చీకటిపడి ఈశ్వరయ్య

మాచిరాజు కామేశ్వరరావు

ఇంటికి వచ్చాడు. ఇల్లు తాళంపెట్టి ఉండటం చూసి అగ్గిమీద గుగ్గిలం అయి పోయాడు. అతను కోపంతో బుసలు కొడుతూ ఇంటి ముందు పచార్లు చెయ్య సాగాడు.

అర్ధరాత్రి అయింది. ఈశ్వరయ్య ఇంటిముందు పచార్లు చేస్తూనే ఉన్నాడు. ఇంతలో ఒక దొంగ అటుగా వచ్చి, ఇంటి ముందు తచ్చాడుతున్న ఈశ్వరయ్యను చూసి, అతను కూడా దొంగే అనుకుని, అతని వీపుమీద తట్టి, ''లోపలికి వెళ్లాలనుకుంటున్నావు కదూ ?'' అన్నాడు.

ఈశ్వరయ్య మరింత చిరాకుతో, ''తలుపుకు తాటికాయంత తాళంకప్ప తగలబడి ఉందిగా ? లోపలికి ఎలా వెళ్ళగలను ?'' అన్నాడు.

''ఆ తాళం క్షణంలో తీయగలను. ఇటుగా ఎవరైనా వస్తారేమో, నువు కనిపెట్టి ఉండు. దొరికిన దేదో ఇద్దరమూ చెరిసగం పంచుకుందాం,'' అని దొంగ, ఈశ్వరయ్య సమాధానానికి ఎదురు చూడకుండా, మారు తాళంచెవితో తలుపు తెరిచి లోపలికి వెళ్లాడు.

ప్రాణం లేచివచ్చి, ఈశ్వరయ్య కూడా దొంగ వెనకే లోపలికి వెళ్లాడు. అప్పటికి దొంగ పెట్టెలున్న గదిలో చేరి, వాటిని తెరిచి చూస్తున్నాడు. ఈశ్వరయ్య చప్పున గది తలుపు మూసి, బయటి నుంచి గడియపెట్టి, ''దొంగ పీనుగా



నా యిల్లే దోచుకుందా మనుకున్నావా ? తెల్లవారనీ నీ సంగతి చెబుతాను !'' అని, తన గదిలోకి వెళ్ళి, పడుకుని నిద్ర పోయాడు. ఈ హడావుడిలో అతను వీధి తలుపు తెరిచే ఉన్న సంగతి మరిచి పోయాడు.

ఒకరాత్రివేళ సుందరమ్మ మేలుకొని, చీకటిపడి భర్త వస్తానన్న సంగతి జ్ఞాపకం తెచ్చుకున్నది. అప్పటి కప్పుడు, కామాక్షమ్మ ఎంత చెప్పినా వినిపించుకోకుండా, తన ఇంటికి బయలు దేరింది. వీధి తలుపు తెరిచి ఉండడం చూసి ఆమె, తాను తాళం వెయ్యడం మరిచిపోయా ననుకున్నది.

దొంగ కిటికీలోనుంచి చూసి, ఎవరో ఆడమనిషి లోపలికి వచ్చిన సంగతి గ్రహించి, తలుపుదగ్గిర చేరి, ''తలుపు తియ్యి ! వేగిరం !'' అన్నాడు.

పరాకుగా ఉన్న సుందరమ్మ, ఆ మాట అన్నది తన భర్తే అనుకుని, ''అరె, నువు ఇంట్లోనే ఉన్నావా? ఇంకా ఊరెళ్లా వనుకున్నాను. వీధి తలుపుకు బదులు ఈ తలుపు గడియ పెట్టి వెళ్లాను కాబోలు. నా పరాకు మండా!'' అంటూ తలుపు గడియ తీసింది.

దొంగ బయటికి వచ్చి, సుందరమ్మను పక్కకు నెట్టి, వీధిలోకి పారిపోయాడు. అయితే వాడు తప్పించుకునే ఆదుర్దాలో ఏమీ దొంగిలించకపోగా, తన డబ్బు సంచీ గదిలో వదిలేసి వెళ్లాడు.

అది ఎలా వచ్చిందో అర్థంగాక సుందరమ్మ భర్తను లేపి సంగతేమిటని అడిగింది.

రాత్రి ఇంటికి రానందుకూ, దొంగను విడిచిపుచ్చినందుకూ, తన నిద్ర పాడు చేసినందుకూ సుందరమ్మను చితక తన్నుదామనుకున్న ఈశ్వరయ్య, ఆమె చేతిలో డబ్బు సంచీ చూసి, తన జన్మలో మొదటిసారి తన భార్య పరాకును మెచ్చుకున్నాడు. అతను అనుకున్నట్టు దొంగను పట్టి ఇస్తే ఆ డబ్బు సంచి తమకు దక్కేదికాదు.



# మూగకాదు

ఒక వర్తకుడు గుర్రంమీద ప్రయాణం చేస్తూ, మధ్యాహ్నం వేళకు ఒక గ్రామంవద్ద కొలను దగ్గిర గుర్రాన్ని ఒక చెట్టుకు కట్టేసి, స్నానం చెయ్యటానికి కొలనులో దిగాడు.

అదే సమయంలో ఇంకో ప్రయాణీకుడు బక్కచిక్కిన గుర్రంమీద వచ్చి, తన గుర్రాన్ని అదే చెట్టుకు కట్టెయ్యబోయాడు.

అది చూసి మొదటివాడు, "అయ్యా, నీ గుర్రాన్ని ఇంకో చెట్టుకు కట్టెయ్యి. నా గుర్రం పొగరుబోతుది," అని కేక పెట్టాడు. కాని రెండోవాడు లక్ష్యపెట్టక తన గుర్రాన్ని ఆ చెట్టుకే కట్టాడు. బక్కగుర్రం పొగరు గుర్రాన్ని కవ్వించింది. రెంటికీ జగడం జరిగి బక్క గుర్రం కాస్తా చచ్చింది.

పరిహారం ఇయ్యమని ప్రయాణీకుడు అడిగితే వర్తకుడు ఒప్పుకోలేదు. ఇద్దరూ ఊరి న్యాయాధికారి వద్దకు వెళ్లారు. గుర్రం పోగొట్టుకున్నవాడు వర్తకుడిమీద ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి, "ఏమంటావ్?" అని వర్తకుణ్ణి అడిగాడు.

ఏమనాలో తెలీక వర్తకుడు దిక్కులు చూశాడు.

"మూగేడుగా ఉన్నాడే? అతని మీదనా ఫిర్యాదు చేస్తావు?" అన్నాడు న్యాయాధికారి.

"మూగవాడా? నా గుర్రం పొగరుబోతుది, నీ గుర్రాన్ని ఇంకో చెట్టుకు కట్టెయ్యి," అని ఊరంతా వినిపించేటట్టు అరిచాడు!" అన్నాడు ప్రయాణీకుడు.

అతడి ఫిర్యాదు నిలువలేదు.

—డా. ఎస్. గంగాధరన్





# మూడు అద్భుతవస్తువులు

ఒక ఊళ్ళో ఒక చితికిపోయిన జమీందారుకు భాగ్యవతి అనే మనవరాలుండేది. ఆమె అసామాన్య సౌందర్యవతి కావటం చేత అనేకమంది యువకులు ఆమెను పెళ్ళాడాలని వచ్చారు. అలా వచ్చిన వాళ్ళకు ముసలి జమీందారు ఒక పరీక్ష పెట్టాడు; మూడు దిక్కుల్లో ఉన్న మూడు అద్భుత వస్తువులు తెచ్చినవాడికి తన మనవరాలినిచ్చి చేస్తానన్నాడు. ఆ అద్భుత వస్తువులు తీసుకురావటానికి కొందరు సాహసికులు ప్రయత్నించి, సాధ్యంకాక విరమించుకున్నారు. వారిని చూసి మరికొందరు ప్రయత్నించకుండానే విరమించుకున్నారు.

ఆ ఊళ్ళోనే జయంతుడనే క్షత్రియ యువకుడు ఉండేవాడు. వాడు అమిత సాహసి అని ఏనాడో పేరు పొందాడు. వాడు భాగ్యవతిని పెళ్ళాడ నిశ్చయించుకుని, కత్తి మొలకు తగిలించుకుని, గుర్రం ఎక్కి వచ్చాడు.

వాణ్ణి చూసి జమీందారు, "నీకు తెలియదా? నా మనవరాల్ని పెళ్ళాడాలంటే మూడు అద్భుత వస్తువులు తేవాలి!" అన్నాడు.

"ఏమిటవి? వాటి వివరాలు చెప్పండి," అన్నాడు జయంతుడు.

"ఇలా దక్షిణంగా వెళితే ఒక పాడుబడిన దేవాలయం వస్తుంది. దాని ఆవరణలో ఎక్కడో భూగర్భ గుహ ఉన్నదట. ఆ గుహలో ఒక డప్పు ఉన్నదట. దాన్ని వాయిస్తే కొంతమంది మనుషులు వచ్చి, మనం చెప్పిన పని చేస్తారట. మొదట నువు ఆ డప్పును తీసుకువస్తే, మిగిలిన రెండు అద్భుత వస్తువులను గురించి చెబుతాను," అన్నాడు జమీందారు.

ఎం. మనోహరరెడ్డి

జయంతుడు దక్షిణ దిక్కుగా వెళ్ళి పోయాడు. వెళ్ళినవాడు పదిరోజుల అనంతరం నీరసించి తిరిగి వచ్చాడు. అద్భుత వస్తువులు తెస్తామని బయలుదేరి మళ్ళీ కనిపించిన వారెవరూ లేరు. అందు చేత జమీందారు ఆశ్చర్యంగా అతన్ని, "డప్పు తెచ్చావా?" అని అడిగాడు.

జయంతుడు ఏమీ చెప్పకుండా తన వెంట తెచ్చిన సంచీలో నుంచి ఒక డప్పు తీసి, జమీందారుకు ఇచ్చాడు. జమీందారు డప్పును అన్నిపక్కలా తిప్పి చూసి, దాన్ని వాయించేసరికి, ఎక్కడినుంచో పదిమందీ మనుషులు బిలబిలమంటూ వచ్చి, "ఏం చెయ్యమంటారు?" అని అడిగారు.

"నా తోటకు కంచె వెయ్యండి," అన్నాడు జమీందారు. వాళ్ళు వెళ్ళి పోయారు.

"రెండో వస్తువు వివరాలు చెప్పండి," అని జయంతుడు జమీందారును అడిగాడు.

"ఇలా పడమరగా వెళితే మరో పాడుబడిన దేవాలయం వస్తుంది. దాని దిగువన ఎక్కడో భూగర్భంలో ఒక తాయెత్తు ఉన్నది. దాన్ని కట్టుకున్న వాళ్ళు కాలం గడిచేకొద్దీ చిన్న వాళ్ళవు తారు," అన్నాడు జమీందారు.

జయంతుడు పడమరగా బయలు దేరుతూ పక్కకు తిరిగి చూసేసరికి, కిటికీ వద్ద నిలబడి తన కేసి ఆశ్చర్యంగా చూస్తున్న భాగ్యవతి కనిపించింది.



కొన్నిరోజుల అనంతరం అతను చినిగిన బట్టలతో తిరిగివచ్చి, జమీందారు చేతిలో తాయెత్తు ఉంచాడు.

జమీందారు ఆ తాయెత్తును తనచేతికి కట్టుకుంటూ, "భేష్! నువే మా భాగ్యవతికి తగిన వరుడివి. ఇప్పుడు ఉత్తరంగా వెళ్ళి, ఒక పాడుబడిన దేవాలయంలో ఉన్న మాట్లాడే చిలుకను తీసుకురా!" అన్నాడు.

జయంతుడు కిటికీ కేసి చూస్తే, భాగ్యవతి తనకేసి మెరిసే కళ్ళతో చూస్తూండటం కనబడింది.

కొన్నిరోజుల అనంతరం జయంతుడు గాయాలతో తిరిగి వచ్చి, పంజరంలో ఉన్న చిలుకను జమీందారు కిచ్చాడు.

"చిలుకా! చిలుకా! నాకు నూరు వరహాలు కావాలి," అన్నాడు జమీందారు చిలుకతో.

"రేపు ఉదయం నూరు వరహాలు దొరుకుతాయి పో!" అన్నది మాట్లాడే చిలుక.

ఆ రాత్రికి జమీందారు జయంతుణ్ణి తన అతిథిగా ఉంచుకున్నాడు. ఉదయం జమీందారు తలుపు తెరిచేసరికి, గుమ్మంలో నూరు వరహాల మూట దొరికింది.

జమీందారు మర్నాడే తన మనవరాలిని జయంతుడి కిచ్చి పెళ్ళిచేశాడు. జయంతుడు భాగ్యవతిని తన ఇంటికి తీసుకుని వెళ్ళిపోయాడు.

ఇంకో రోజు జమీందారు చిలుకతో, "చిలుకా, నాకు వెయ్యి వరహాలు కావాలి!" అన్నాడు.

"ఇంకెక్కడి వెయ్యి వరహాలు? జయంతుడు నాటకమాడాడు. నేను జయంతుడి పెంపుడు చిలుకను!" అంటూ చిలుక ఎగిరిపోయింది.

జమీందారు హతాశుడై డప్పును పైకి తీసి వాయించాడు. డప్పు పగిలిపోయిందే గాని మనుషులు రాలేదు.

జమీందారు తన చేతికి కట్టుకున్న తాయెత్తును పీకి పారేస్తూ, "మోసం! మోసం!" అని గుండె బాదుకున్నాడు.





ఒకానొక గ్రామంలో దిగంబరుడు అనే పండితుడు ప్రాథమిక పాఠశాలలో అధ్యాపకుడుగా పనిచేసేవాడు. అతను సజ్జనుడూ, గ్రామస్థులందరికీ ప్రీతి పాత్రుడూనూ. ఆయన కూతురు సులేఖ మరొక గ్రామంలో ఉండే ఉపాధ్యాయుణ్ణి పెళ్ళాడింది. ఆమె ఏడాది కొకసారి తండ్రిని చూడవచ్చేది. దిగంబరుడు ఏడాదికి ఒకటి, రెండుసార్లు కూతుర్ని చూడబోయేవాడు.

సులేఖ పెళ్ళి అయినాక దిగంబరుడి భార్య చనిపోయింది. తరవాత ఇల్లూ, బడీ కూడా దిగంబరుడే చూసుకోవలసి వచ్చింది. భార్యపోయినాక ఇంటి ఖర్చు కొంత తగ్గటంచేత దిగంబరుడు తన జీతంలో కొంత నెలనెలా మిగిల్చి తన కూతురికి ఒక హారం చేయింతామను కుని, నకులేశ్వరుడనే స్వర్ణకారుడిదగ్గిర డబ్బు దాస్తూ వచ్చాడు. అలా రెండేళ్ళు దాచిన డబ్బుతో నకులేశ్వరుడే హారం తయారుచేసి ఇస్తాడు.

సులేఖ తనను చూడవచ్చినప్పుడు దిగంబరుడు ఆమెకు తన ఆలోచన చెప్పాడు.

"ఎందుకు, నాన్నా? పెద్దవాడి వయావు. చక్కగా పాలూ, పుష్టికరమైన ఆహారమూ తినక, డబ్బెందుకు మిగుల్చు తావు?" అన్నది సులేఖ.

"అలా కాదులే, తల్లీ. నీ పెళ్ళికి కూడా అంతగా నగలు పెట్టలేక పోయాను. అదీకాక నీకు హారం చేయించి పెట్టాలని మీ అమ్మ ఎంతగానో అను కునేది," అని దిగంబరుడు కూతురిని సమాధానపరిచాడు.

నకులేశ్వరుడు డబ్బు ఇచ్చే గడువు రెండు సంవత్సరాలు నిండుతున్న



దనగా, ఒకనాడు దిగంబరుడు బడిలో గుండెపోటు వచ్చి, స్పృహలేకుండా పడి పోయాడు. విద్యార్థులు కంగారుపడి ఊళ్ళోవాళ్ళను పిలిచారు. దిగంబరుణ్ణి ఇంటికి చేర్చారు. వైద్యుడు వచ్చి ఏదో చికిత్స చేశాడు. సులేఖకు కబురు చేసి, గ్రామస్థులు వంతులు వేసుకుని, అహో రాత్రాలు దిగంబరుణ్ణి కనిపెట్టి ఉన్నారు. ఇంతలో సులేఖ తన భర్తతో రానే వచ్చింది.

దిగంబరుడు మూడు రోజులపాటు స్పృహలేకుండా ఉండి, నాలుగోరోజు మధ్యాహ్నం కొద్దిసేపు కళ్ళుతెరిచి, ఏదో చెప్పబోయి, మాటరాక, కళ్ళ నీరు కార్చి, ఊపిరాడక తన్నుకుని, ప్రాణం వదిలాడు.

దిగంబరుడి కోరిక ప్రకారం అతని ఇల్లు బడికి ఇచ్చేసి, సులేఖ తండ్రికి అంత్యక్రియలు జరిపించింది. ఊళ్ళో అందరూ వచ్చి సులేఖను పరామర్శిం చారు గాని, నకులేశ్వరుడు మాత్రం రాలేదు.

ఒకనాటి ఉదయం సులేఖ తానే అతన్ని చూడబోయింది.

''దిగంబరదాదా పోవటం ఊరికి చాలా నష్టం. నిన్ను చూడవద్దా మనుకున్నాను గాని నా ఒంట్లో బాగా లేదు,'' అన్నాడు నకులేశ్వరుడు ఇకిలిస్తూ.

''నాకు కొంచెం ఖర్చు హెచ్చుగా ఉన్నది. మా నాన్న నీ దగ్గిర దాచిన డబ్బు ఇచ్చేస్తావా ?'' అని సులేఖ అడిగింది.

''ఏం డబ్బు ? మీ నాన్న నాకేమీ డబ్బియ్యలేదు,'' అన్నాడు నకులేశ్వరుడు.

''నీ దగ్గిర నెలనెలా డబ్బు దాస్తు న్నట్టూ, నీ చేత నాకు హరం చేయించ దలచినట్టూ కిందటి నెలే నాన్న నాతో అన్నాడు. అయన అబద్ధం ఆడా డంటావా ?'' అన్నది సులేఖ.

"అది నాకు తెలీదు! మీ నాన్నకు నేనేమీ బాకీ లేను," అన్నాడు నకులేశ్వరుడు.

సులేఖ వెంట నకులేశ్వరుడి ఇంటికి వచ్చిన ఊరి పెద్దలు అతనికి ఎంతగానో చెప్పి చూశారు గాని, నకులేశ్వరుడు తన దగ్గిర దిగంబరుడి డబ్బు ఉన్నట్టు ఒప్పుకోనేలేదు.

వారిలో సోమనాథు డనే ఇంద్రజాలికుడు ఉన్నాడు. అతను దయ్యాలను ఆవాహన చెయ్యటంలోనూ, వదల గొట్టటంలోనూ ఘటికుడు. అతను ముందుకు వచ్చి, "సరే, సాక్షులు లేరు. దిగంబర పండితుడే మో అకస్మికంగా పోయాడు. ఎలాటి పత్రాలూ, సంతకాలూ లేవు. అందుచేత సమస్య చాలా గడ్డుగా తయారయింది. దీన్ని పరిష్కరించటానికి దిగంబర పండితుడి ఆత్మను ఆవాహన చేసి, సాక్ష్యం చెప్పిస్తాను. అందుకు అభ్యంతర మేమన్నా ఉంటుందా ?" అన్నాడు.

అందరూ ఏకగ్రీవంగా తమ సమ్మతి తెలిపారు.

అనుకున్న రోజున దిగంబరుడి ఇంటి ఆవరణలో గ్రామంలోని జనం వింత చూడటానికి గుంపులు గుంపులుగా పోగయారు.




చీకటి పడబోతూండగా సోమనాథుడు ఒక మట్టి పిడతతోనూ, మూకుడుతోనూ తయారై, "ఎవరైనా వెళ్ళి దొడ్లో ఉన్న నిమ్మచెట్టునుంచి పండబారిన కాయలన్నీ కోసుకు రండి," అన్నాడు.

దిగంబరుడి ఆవరణలో ఒక నిమ్మ చెట్టు ఉన్నది. అది దిగంబరుడికి ఎంతో ప్రీతిపాత్రమైనది. అది ఏడాది పొడుగునా కాసేది. భోజనంలోకి ప్రతి పూటా దిగంబరుడికి నిమ్మకాయ ఉండి తీరాలి. చాలాకాలంగా ఆయనకుగల కోరికను అనుసరించి, దిగంబరుణ్ణి ఆ నిమ్మచెట్టు సమీపంలోనే దహనం చేశారు.

నలుగురూ ఉత్సాహంగా వెళ్ళి ఒక బుట్ట నిండుగా నిమ్మకాయలు కోసి తెచ్చారు.

సోమనాథుడు గ్రామస్థులతో, ''దిగంబర పండితుడు పోయి అయిదు రోజులే అయింది గనక ఆయన ఆత్మ ఇంకా ఇక్కడే తిరుగుతూ ఉంటుంది. దాన్ని ఆవాహన చేసి, ఆయనకు ఇష్టమైన నిమ్మరసం రుచి చూపిస్తాను. దిగంబర పండితుడు నీకు డబ్బు ఇచ్చినమాట నిజమైతే ఆయన ఈ కుండలోకి వచ్చినట్టు దాఖలా చూపిస్తాడు,'' అని, నిమ్మకాయలన్నీ కోసి, రసం కుండ నిండా నింపి, దానిమీద ఒక గుడ్డకప్పి, పైన మూకుడు ఉంచాడు.

తరవాత సోమనాథుడు ఏవో మంత్రాలు చదవసాగాడు.

త్వరలోనే కుండలో సంక్షోభం బయలు దేరింది. నిమ్మరసం కుతకుత లాడ సాగింది. కుండలోనుంచి నురుగు పైకి లేచి, మూకుడును ఎగదోయ నారంభించింది.

''పండితుడి ఆత్మ సాక్ష్యం చెబుతున్నది. అతని డబ్బు నకులేశ్వరుడి వద్ద ఉన్నది. నకులేశ్వరుడు ఆ మాట ఒప్పుకోవాలి. లేదా పండితుడి ఆత్మను నకులేశ్వరుడిమీదికి ప్రయోగం చేస్తాను," అన్నాడు సోమనాథుడు.

''అవునవును. నా దగ్గిర డబ్బు ఉన్న మాట నిజమే. సులేఖకు డబ్బే కావాలో, హారమే కావాలో, ఏది కావాలన్నా ఇస్తాను,'' అన్నాడు నకులేశ్వరుడు.

సులేఖ హారమే పుచ్చుకున్నది.

సోమనాథుడు చేసిన హస్తలాఘవం ఏమిటంటే, అతను కుండమీద కప్పిన గుడ్డలో బట్టలు ఉతికే సోడా గడ్డ పెద్దది దాచి, దాన్ని చల్లగా నిమ్మరసంలోకి జారవిడిచాడు. దానికి ఆమ్లం తగలగానే పెద్దపెట్టున పొంగి, పొగలు చిమ్మి, నురుగులు తెప్పించింది.





# వైద్య రహస్యం

రామాపురం మొత్తానికి అనంతాచార్లు ఒక్కడే వైద్యుడు. ఆయన వారం రోజుల క్రితం గ్రామాంతరం వెళ్ళి తిరిగి వస్తూనే, కరణంగారి మనుషులు తన కోసం వేచి వుండటం చూశాడు. విచారించగా, గ్రామకరణంగారు రెండు రోజులుగా మూసిన కన్ను తెరవకుండా జ్వరంతో పడి ఉన్నట్టు ఆచార్లుకు తెలిసింది. ఆయన అప్పటికప్పుడే మందుల పెట్టెతో సహా హుటాహుటి కరణంగారింటికి పరిగెత్తాడు.

కరణంగారికి జ్వరం హెచ్చుగానే ఉన్నది. ఆయన పడుకున్న గది ముందు చుట్టాలూ, ఊళ్ళో పెద్దలూ అనంతాచార్లు కోసం ఎదురు చూస్తున్నారు.

అనంతాచార్లు అక్కడికి చేరుతూనే ఎవరినీ పలకరించకుండా, తిన్నగా రోగి ఉన్న గదిలోకి వెళ్లి తలుపులు మూశాడు. రోగుల్ని ఏకాంతంగా పరీక్షించటం ఆయన అలవాటు.

అయితే ఎంతసేపటికీ ఆచార్లు రాకపోయేసరికి, లోపల ఏం జరుగుతున్నదోనని బయటివాళ్ళకు అదుర్దా పుట్టింది.

ఇంతలో ఆచార్లు తలుపులు ఓరగా తెరిచి, కరణంగారి పెద్దబ్బాయితో, "బాబూ, ఒక పెద్ద మేకు తెప్పించి పెడతావూ?" అన్నాడు.

ఆచార్లు తెమ్మన్న మేకు క్షణాల మీద వచ్చింది. ఆచార్లు దాన్ని తీసుకుని తలుపులు వేసుకున్నాడు.

లోపలినుంచి చిన్న చిన్న చప్పుళ్ళు వినిపించాయి. కొంతసేపయాక తలుపులు మళ్ళీ కొద్దిగా తెరుచుకున్నాయి. ఆచార్లు బయటికి తొంగి చూసి, కరణంగారి కెలా ఉన్నదని మునసబు అడిగిన ప్రశ్న

జొన్నలగడ్డ రత్న

వినిపించుకోక, ''ప్రస్తుతానికి సుత్తి ఒకటి తెప్పించి పెట్టండి. తరవాత మాట్లాడదాం!'' అన్నాడు.

సుత్తి వచ్చింది. దాన్ని తీసుకుని ఆచార్లు మళ్ళీ తలుపులు మూశాడు. ఈసారి గదిలో నుంచి పెద్ద చప్పుళ్ళు వినిపించాయి.

కొంచెంసేపటికి తలుపులు మళ్ళీ కొద్దిగా తెరుచుకున్నాయి.

కరణంగారి తమ్ముడు ఆదుర్దాగా ఆచార్లును, ''అన్నయ్య కెలా ఉంది?'' అని అడిగాడు.

''ఆ సంగతి తరవాత చెబుతాను. ముందు గునపం ఒకటి వెంటనే కావాలి,'' అన్నాడు ఆచార్లు.

ఎవరో గునపం తెచ్చి అనంతాచార్లకు అందించారు. దాన్ని తీసుకుని అతను మళ్ళీ తలుపులు మూశాడు.

ఈసారి బయట వేచివున్న వాళ్ళకు గదిలో నుంచి చాలా పెద్ద చప్పుళ్ళు వినిపించాయి.

లోపల వైద్యుడు ఏం చేస్తున్నదీ బయటివాళ్ళకు కొంచెం కూడా అర్థం కాలేదు. వారి ఆదుర్దా మరింత అయింది. కొందరు తలుపులమీద బాది, ఆచార్లను బయటికి రమ్మన్నారు. లోపలి నుంచి సమాధానం లేదు. చప్పుళ్ళు నిలిచిపోనూ లేదు.

''ఇక లాభం లేదు. తలుపులు బద్దలు కొట్టి సంగతేమిటో చూడండి. చెవులు గింగుర్లెత్తే, ఆ చప్పుళ్ళేమిటి!'' అన్నాడు మునసబుగారు.

క్షణంలో తలుపులు పగలగొట్టారు. లోపల కరణంగారు పడుకుని ఉన్న మంచానికి సమీపంలో నేల మీద కూర్చుని, తన మందులపెట్టె తాళాన్ని పగలగొట్టటానికి మేకూ, సుత్తీ, గునపమూ రకరకాలుగా ఉపయోగిస్తూ అనంతాచార్లు కనబడ్డాడు.

అది చూసి, అప్పటివరకూ ఆదుర్దా పడిపోతున్న వాళ్ళందరూ ఒక్కసారి గొల్లున నవ్వారు.






రాముడు అయోధ్యలో అతివైభవంగా పట్టాభిషిక్తుడైన తరవాత స్వయంగా రాజ్యపాలన విషయాల్లో శ్రద్ధతీసుకో సాగాడు. అతను ఒకనాడు సుమంతుణ్ణి పిలిపించి, తనకు రాజ్యంలో ప్రజోపయోగకార్యాలు భారీ ఎత్తున చేయాలని వున్నదనీ, అందుకు అవసరం అయిన ధనం సమకూర్చమనీ చెప్పాడు.

''గడచిన పధ్నాలుగేళ్ళుగా ప్రజలు, తాము కట్టవలసిన కప్పాలు కట్టటం మానివేశారు, ప్రభూ!'' అన్నాడు సుమంతుడు.

"సకాలంలో వర్షాలుపడక కరువు, కాటకాలు వచ్చి, ప్రజలు అవస్థల పాలయ్యారన్న మాట!'' అన్నాడు రాముడు బాధగా.

సుమంతుడు ఒకక్షణకాలం సంశయిస్తూ వూరుకుని, ''అలాంటి దేమీ లేదు, ప్రభూ! దేశం సస్యశ్యామలంగానే వున్నది. ప్రజలే మారిపోయారు. ధనికులైన వర్తకులు పన్నులు ఎగవేశారు; రైతులు కప్పాలు చెల్లించలేదు. సంపన్నులు మరికాస్త సంపన్నులయారు; పేదలు మరింతగా పేదలైపోయారు,'' అన్నాడు.

''ఇలా ఎందుకు జరిగింది? మరి భరతు డేం చేస్తున్నాడు?'' అన్నాడు రాముడు చిరుకోపంగా.

''ప్రభూ, ఆయన రాజ్యపాలన చేసిం దెప్పుడు! తమ పాదుకలను పూజిస్తూనే పధ్నాలుగేళ్ళూ గడిపేశాడు. అతని

**39. రామరాజ్యంలో హనుమంతుడి ముచ్చట్లు**



అమాయకత్వాన్ని ఆసరాగా తీసుకుని, అతని ముందు తమ నామ సంకీర్తనం చేసి, చాలామంది బహుమానంగా ధనం పుచ్చుకుపోయారు. దేశపాలకుడుగా ఆయన కర్తవ్యాన్ని గుర్తుచేస్తే, 'పన్నులు కట్టని ప్రజలను ఎలాంటి బాధలకూ గురిచేయకండి. అందరూ మా అన్న గారైన శ్రీరాముని పౌరులేగదా!' అని మాత్రం చెప్పి పూరుకున్నాడు. నేను, ప్రభువైన వారి ఆజ్ఞను శిరసావహించవలసిన వాణ్ణేగద,'' అన్నాడు సుమంతుడు.

రాముడికి సంగతంతా అర్థమైపోయి, ''ఇంక నేనెలా రాజ్యపాలన చేసేది?'' అంటూండగా లక్ష్మణుడు వచ్చాడు.

సుమంతుడు, లక్ష్మణుడికి కూడా ధనాగారం వట్టిపోయిన సంగతి చెప్పాడు.

లక్ష్మణుడు కొంచెం సేపు ఆలోచించి, ''అయితే, నా మాట మన్నించి ఒక పని చేయండి. ప్రభుత్వానికి పన్ను చెల్లించవలసిన వారందరూ, తలా ఒక గుమ్మడికాయంత బంగారం యిచ్చుకుంటే చాలునని చాటింపువేయించండి. ఈ పద్ధతి వల్ల ప్రజలకు ఎలాంటి అన్యాయం జరగదని హామీ యిస్తున్నాను,'' అన్నాడు.

రాముడు యిందుకు అంగీకరించాడు. ఆ రోజునే కోసలదేశం అంతటా చాటింపు వేయబడింది. పధ్నాలుగేళ్ళుగా పన్నులు ఎగవేసిన దేశప్రజలు, గుమ్మడికాయంత బంగారంకాదు, ఏనుగు తలకాయంత బంగారం యివ్వమన్నా, యివ్వటానికి సిద్ధంగా వున్నారని లక్ష్మణుడికి తెలుసు. అయినా ఎందుకైనా మంచిదని లక్ష్మణుడు హనుమంతుణ్ణి పిలిచి, ''నీవు ప్రజల మధ్య రహస్యంగా తిరిగి, ఈ చాటింపు విషయమై, వాళ్ళేమైనా అసంతృప్తి చెందారేమో తెలుసుకు రా,'' అని చెప్పాడు.

హనుమంతుడు సూక్ష్మరూపంతో ప్రజల మధ్యకు వెళ్ళి, వాళ్ళనుకునేదంతా విని తిరిగి వచ్చి, లక్ష్మణుడితో, ''గుమ్మడికాయంత బంగారం యివ్వటానికి ప్రజల్లో ఎవరికీ అభ్యంతరం

లేకపోగా, వాళ్ళు, భరతుడికన్న రాముడు యింకా అమాయకుడని మాట్లాడు కుంటున్నారు. ఇన్నేళ్ళుగా పన్నులు చెల్లించనందుకు, ఎన్నో గుమ్మడికాయల ఎత్తు బంగారం చెల్లించమని అననందుకు వాళ్ళు చాలా సంతోషిస్తున్నారు,'' అని చెప్పాడు.

ఇది విన్న మీదట లక్ష్మణుడికి ఒక సందేహం కలిగింది. ప్రజల్లో కొందరైనా నీతిమంతులు వుండకపోరు. అలాంటి వారికి అన్యాయం జరక్కూడదు. గుమ్మడి కాయంత బంగారంకన్న తక్కువ చెల్లించ వలసిన వారెవరైనా వుంటే, వాళ్ళు బాధపడకూడదు!

లక్ష్మణుడు యీ సమస్యకు పరిష్కారం ఏమిటా అని కొంచెంసేపు ఆలోచించి, ఒక ఉపాయం తోచగా, హనుమంతుణ్ణి వెంట బెట్టుకుని, అయోధ్యలోవున్న ధర్మ దేవతాలయానికి వెళ్ళాడు. ఆలయంలో కొంతసేపుండి లక్ష్మణుడూ, అతిసూక్ష్మ రూపంతో హనుమంతుడూ, చిన్నగా మాట్లాడుకుంటూ బయిటికి వచ్చారు. ఆ సమయానికి సూర్యాస్తమానమై, బాగా చీకటి పడిపోయింది.

ఉదయం అవుతూనే రాజభవన ప్రాంగణంలో పెద్ద త్రాసు ఒకటి వేలాడ కట్టారు. ఒక సిబ్బెలో మామూలు గుమ్మడి



కాయ వుంచారు. ప్రజలంతా బంగారం మూటలు కట్టుకుని అక్కడికి వచ్చారు. వాళ్ళల్లో ఒకడు ముందుగా తాను తెచ్చిన బంగారాన్ని రెండవ సిబ్బెలో వేశాడు. గుమ్మడికాయవున్న సిబ్బె పైకి లేవలేదు. అతడు ఆశ్చర్యపోయి, తల గోక్కుంటూ ఇంటికి పరిగెత్తి, యీసారి పెద్ద బంగారం మూటతో తిరిగి వచ్చి, దాన్నంతా సిబ్బెలో వేసిం తరవాత, తూకం సరిపోయింది. ఇది చూసిన ప్రజలు ఇళ్ళకుపోయి, మరి కొంత బంగారం తీసుకుని వచ్చారు.

ప్రజల్లో ఒకడు భయపడుతూనే తన దగ్గిరున్న కొద్ది బంగారాన్ని త్రాసులో వేశాడు. ఆ కొద్దిపాటి బంగారానికే కాటా



కొమ్ము వాలి, మొగ్గు చూపింది. ఇది చూసిన ప్రజలు చాలా విడ్డూరపడ్డారు.

ఇలా మరికొందరు త్రాసులో బంగారం వేసిం తరవాత, అది సామాన్యమైన త్రాసు కాదనీ, ఏదో మహత్తుగలదనీ, న్యాయంగా ఎవరెంత చెల్లించాలో అంత తీసుకుంటుందనీ గ్రహించి, ప్రజలు సంతోషంగా తాము చెల్లించవలసినదంతా చెల్లించారు. ఆ విధంగా చాలా బంగారం వసూలైంది. కోశాగారం నిండిపోయింది.

ఈ జరిగినది చూసి రాముడు ఆశ్చర్య పడ్డాడు. అతను లక్ష్మణుణ్ణీ, మంత్రి సుమంతుణ్ణీ తన రహస్య సమాలోచనా మందిరానికి పిలిపించాడు. వాళ్ల వెనకగా హనుమంతుడు కూడా సూక్ష్మ రూపంలో మందిరం ప్రవేశించాడు.

"లక్ష్మణా, గుమ్మడికాయ బరువెంత వుంటుంది? అది మణుగులకొద్దీ బంగారానికి సరిసమానంగా తూగింది! అంతే కాక రకరకాల బరువుల్ని చూపింది. మీరంతా కలిసి ప్రజల్ని మోసగించారు, ఔనా?" అని రాముడు గద్దించి అడిగాడు.

లక్ష్మణుడు చేతులు కట్టుకుని, "ఇందులో మోసం ఏమీ లేదు; అంతా ధర్మదేవత అదేశానుసారం జరిగింది. ఇందులో మన హనుమంతుడు పడిన శ్రమ కూడా కొంత లేకపోలేదు! త్రాసు మీది నడికొమ్ము పట్టుకుని హనుమంతుడు సూక్ష్మరూపంలో నిలబడ్డాడు. ధర్మదేవత చెప్పినంతమేరకు ఎటు ఎంత మొగ్గు చూపాలో, అటుపక్క త్రాసును పాదంతో నొక్కి పెడుతూ వచ్చాడు. ధర్మదేవత ఏమి చెప్పిందో అది ఒక్క హనుమంతుడికే వినిపించింది. నేనూ, హనుమంతుడూ ధర్మదేవతను అర్థించి, యీ విధమైన సహాయాన్ని పొందాము. ప్రజల్లో ధర్మం తప్పక పన్నులు కట్టిన వారు కొద్దిమందే; ఎగవేసిన వాళ్ళు చాలా మంది వున్నారు. ఇప్పుడు న్యాయసమ్మతంగా రావలసిన పన్నులన్నీ వసూలు చేశాం. ఈ పథకం ఆలో

చించేందుకు నేనూ, హనుమంతుడూ చాలా శ్రమపడ్డాం,'' అన్నాడు.

రాముడు ఏదో అనబోయేంతలో, ''రామా! లక్ష్మణుడు చెప్పింది నిజం!'' అంటూ ధర్మదేవత అశరీరవాణి వినిపించింది. ఆ వెంటనే హనుమంతుడు సూక్ష్మరూపం నుంచి నిజరూపం ధరించి, రాముడికి వీరాసనంవేసి, నమస్కరించారు. రాముడు హనుమంతుణ్ణి ఎంతగానో శ్లాఘించాడు.

ఆ తరవాత కొద్దిరోజులకు రాముడు, కోసల నగర పౌరులందరికీ విందు భోజనం ఏర్పాటు చేశాడు. ఆ విందుకు అవసరం అయిన సామగ్రులు తెప్పించటంలోనూ, చలవ పందిళ్ళు వేయించటంలోనూ హనుమంతుడే ముందుండి, ఒక్క క్షణమైనా తీరిక లేకుండా పనిచేయసాగాడు.

సీత, హనుమంతుడు పడుతున్న శ్రమ గమనించింది. ఆమెకు అతడంటే పుత్ర వాత్సల్యం. లంకలో తన ఉనికిని మొదటగా తెలుసుకున్నవాడతను. ఆమె, హనుమంతుణ్ణి దగ్గిరకు పిలిచి, 'నాయనా, హనుమా! ఉదయం నుంచీ క్షణంతీరిక లేకుండా శ్రమిస్తున్నావు. భోజన సమయం అయింది. అతిథులకు ఏ లోటూ రాకుండా చూడవలసిన వాడివి నువ్వు. అందువల్ల



ముందుగా నువు భోజనం చెయ్యటం బావుంటుంది.'' అన్నది.

హనుమంతుడు సరేనని, సీత వెనకగా వంటశాలలోకి వెళ్ళాడు. సీత అతడికి విస్తరివేసి వడ్డించటం ప్రారంభించింది. హనుమంతుడు వడ్డించిన పదార్థాలు మరుక్షణం తినేస్తున్నాడు. ఇలా కొంత సేపు జరిగేసరికి వేలమంది పౌరుల కోసం వండిన అన్నం, కూరల గంగాళాలూ ఖాళీ అయిపోసాగినై. ఇది చూసి సీత ఆశ్చర్యపోతూ పరుగు, పరుగున రాముడి దగ్గిరకు పోయి, సంగతి చెప్పింది.

రాముడు నవ్వి, ''హనుమంతు డెవరనుకుంటున్నావు? పరమశివుడు,



ఈ రూపంలో అవతరించాడు. అతణ్ణి ఎలా తృప్తిపరుస్తావో, అదంతా నీ ప్రజ్ఞ. నే చేయగలిగిందేమీ లేదు,'' అన్నాడు.

సీత వంటశాలకు తిరిగివచ్చి, హను మంతుడికి వెనకగా నిలబడి, మనసులో, ''పరమేశ్వరా! నీ వెవరో నేను తెలుసు కున్నాను. ఇంతటితో నీ ఆకలికి స్వస్తి చెప్పకపోతే, మా పరువు దక్కదు, స్వామీ!'' అనుకుని పంచాక్షరీ మంత్రాన్ని ముమ్మారు పఠించింది.

ఆ మరుక్షణం హనుమంతుడు తృప్తిగా త్రేన్చాడు. సీత అతడి ముందుకు వచ్చి, ''ఏం నాయనా, ఇంకా వడ్డించ మంటావా?'' అని అడిగింది.

''వద్దు తల్లీ, వద్దు! కడుపు నిండి పోయింది,'' అని హనుమంతుడు వంట శాల నుంచి బయిటికి వెళ్ళాడు.

ఆ తర్వాత సీత, అన్నపూర్ణాదేవిని ధ్యానించింది. ఆమె వంటకాలను ఎప్పటిలా గంగాళాలలో నింపింది. పౌరులకూ, వానరులకూ విందు ప్రారంభ మయింది. వానరుల పంక్తిలో చివరగా కూర్చున్న ఒక పిల్ల వానరుడు, ఊర వేసిన ఉస్తికాయను వింతగా చూస్తూ, వేళ్ళతో నొక్కేసరికి, ఉస్తికాయవిత్తు తుప్‌మంటూ పైకెగిరింది.

పిల్లవానరుడు, ''అట్! నీకే గంతు వెయ్యటం వచ్చనుకున్నావా? చూడు, నా ప్రతాపం!'' అంటూ లేచి, పైకెగిరాడు. వాణ్ణి చూసి మరొక వానరుడు, మరి కాస్త ఎత్తు ఎగిరాడు. అది చూసి మరొక వానరుడు యింకొంచెం పైకెగిరాడు.

ఈ విధంగా వానర సమూహమంతా ఒకర్ని మించి మరొకరు అంతరిక్షంలోకి ఎగరసాగారు. అంగదుడూ, నీలుడూ, సుగ్రీవుడూ కూడా ఎగిరారు. హను మంతుడు మాత్రం, అలా ఎగరమని రాముడి ఆజ్ఞ ఏమో అనుకుని, లాంఛన ప్రాయంగా ఒక కుప్పిగంతు వేశాడు.

వానరుల కోలాహలం చూసి రాముడు అక్కడికి వచ్చి, హనుమంతుడితో,

''అందరూ అలా ఆకాశంలోకి ఎగురుతూంటే, నువ్వు చిన్న గంతు వేసి వూరుకున్నావేం ?'' అని అడిగాడు.

''రామా, యింతమంది మహావీరుల ముందు, నేనేపాటి ?'' అన్నాడు హనుమంతుడు వినయంగా.

అప్పుడు జాంబవంతుడు ముందుకు వచ్చి, ''రామా ! హనుమంతుడికి ఒకరు చెపితేనేగాని, అతడి శక్తిసామర్థ్యాలు తెలియవు,'' అన్నాడు.

రాముడు ఒక తెల్లతామరను హనుమంతుడికి యిస్తూ, ''మా వంశకర్త అయిన సూర్యభగవానుడికి, యీ తెల్ల తామరను అర్పించవలసి వున్నది. సూర్యుణ్ణి శ్వేతపద్మధరుడని పిలుస్తారు. దీన్ని ఆయనకు చేర్చగలవాడివి నువ్వొక్కడివే !'' అన్నాడు.

హనుమంతుడు, ''రామాజ్ఞ !'' అంటూ తెల్లతామరను తీసుకుని, ఒక్క ఎగురున ఆకాశంలోకిపోయి, సూర్యుడి రథాన్ని పట్టుకుని, ''గురుదేవా ! రాముడు దీన్ని మీకు సమర్పించమన్నాడు,'' అంటూ తామరపువ్వును సూర్యుడి పాదాలముందు వుంచాడు.

సూర్యుడు, హనుమంతుణ్ణి, ''చిరంజీవ !'' అని దీవించి, తన చేతనున్న ఒకశ్వేతపద్మాన్ని హనుమంతుడికి యిచ్చి, ''దీన్ని రాముడికి యివ్వు. దీని ప్రభావం వల్ల రాముడిపాలనలో దేశం సుభిక్షంగా వుంటుంది !'' అన్నాడు.

ఆ శ్వేతపద్మం వాడదు. అది ఎక్కడ వుంటే అక్కడ వర్షాలు సక్రమంగా కురుస్తాయి. సస్యాలు సమృద్ధిగా పండుతాయి. ప్రజలకు ఎలాంటి వ్యాధులూ సోకవు. హనుమంతుడు, సూర్యుడి దగ్గిర సెలవుతీసుకుని, పద్మంతో తిరిగి వచ్చి, దాన్ని రాముడికి యిచ్చాడు.

రాముడు మహదానందంతో హనుమంతుణ్ణి కౌగలించుకున్నాడు. హనుమంతుడు, సీతారాములకు ప్రణమిల్లాడు. సీత, ''నాయనా, నువ్వు చిరంజీవిగావుండు !'' అని దీవించింది.





# కిట్టూరు రాణీ చెన్నమ్మ

కర్నాటక ప్రాంతంలోని కిట్టూరు అనే రాజ్యానికి రాణీ చెన్నమ్మ పరిపాలకురాలు. చరిత్ర ప్రసిద్ధి చెందిన సిపాయి కలహానికి మూడు దశాబ్దాల ముందు, దేశాన్ని ఆక్రమించుకోజూస్తున్న బ్రిటిషు ఈస్టిండియా కంపెనీవాళ్ళు, ఈ కిట్టూరు రాణి చేత చావుదెబ్బ తిన్నారు.



మల్లసూర్జ అనే కిట్టూరు రాజుకు రెండవ భార్య రాణి చెన్నమ్మ. మొదటి భార్య అయిన రాణి రుద్రమ్మకూ, చెన్నమ్మకూ కూడా చెరొక కొడుకూ వున్నారు. అయినా మల్లసూర్జ మరణ సమయంలో రాణి చెన్నమ్మ, అతడు మరొక కుర్రవాణ్ణి దత్తు తీసుకునేట్టు ప్రోత్సహించింది.



రాణి రుద్రమ్మకు పరిపాలనా విష యాల్లో ఎలాంటి ఆసక్తి లేదు. మల్ల సూర్జ మరణానంతరం రాణి చెన్నమ్మ, రుద్రమ్మ కుమారుడికి పట్టాభిషేకం చేసి, తన కుమారుణ్ణి అతడికి అంగ రక్షకుడుగా నియమించింది. కాని, ఆ ఇద్దరూ అకాల మరణం చెందటంతో, చెన్నమ్మ దత్తు కుమారుణ్ణి రాజ్యాధి పతిగా ప్రకటించింది.



ఈస్టిండియా కంపెనీ సైనికులు, అప్పటికే దేశంలో పలు ప్రాంతాలను ఆక్రమించుకుని వున్నారు. కంపెనీ ప్రతినిధి అయిన థాకరే అనేవాడు కొంత సైన్యంతో వచ్చి, కిట్టూరు కోట ముందు డేరాలు వేయించి, రాణి చెన్నమ్మకు సంప్రతింపులకు తన వద్దకు రావలసిందిగా లేఖ పంపాడు; చెన్నమ్మ తిరస్కరించింది.



థాకరే ఉగ్రుడైపోయాడు. కిట్టూరు రాజు మరణించాడు గనక, ఆ రాజ్యం కంపెనీపరం అయిపోయిందని అతడు అప్పటికప్పుడే ప్రకటించి, సైనికులకు కిట్టూరు కోటపై దాడి చేయవలసిందిగా ఆజ్ఞ యిచ్చాడు. కోటపైనుంచి రాణీ సైనికులు కాల్పులు ప్రారంభించారు. ఆ తుపాకీ గుళ్ళ దెబ్బకు థాకరే కింది ఉద్యోగులైన బ్లాక్, డిప్టాన్ అనే వాళ్ళు మరణించారు.



ఇది చూసి థాకరే మతిపోయినవాడిలా అయి, తానే కోటపైకి సైనికులను నడిపాడు. రాణీ చెన్నమ్మ స్వయంగా కోట రక్షణకు పూనుకున్నది. ఆమె ఆజ్ఞాపించగా, తుపాకీ పేల్చటంలో నిపుణుడైన ఒక సైనికుడు, థాకరేపై గురిచూసి తుపాకీ పేల్చాడు. థాకరే గుర్రం మీది నుంచి కిందపడి అక్కడి కక్కడే మరణించాడు. అతడి సైనికులు భీతి చెంది పారిపోయారు.



ఈ యుద్ధంలో ఈస్టిండియా కంపెనీ సైనికులు చాలామంది రాణీ చెన్నమ్మకు ఖైదీలుగా దొరికారు. చెన్నమ్మ వాళ్లను ఎలాంటి హింసల పాలు చేయకుండా, కోటలో ఒకచోట తగిన సౌకర్యాలతో వుంచింది.



ఈ అపజయవార్త ఈస్టిండియా కంపెనీ యజమానులను కలతపరిచింది. ఒక చిన్న రాజ్యాన్ని పాలించే రాణీ చేత, ఓటమి పొందటం తమ ప్రతిష్ఠకు భంగమని వాళ్ళు భావించారు. దుష్ట మార్గాలనైనా సరే, కిట్టూరును ఆక్రమించి తీరాలని వాళ్లు నిశ్చయించారు.



దేశంలో అక్కడా, యిక్కడా వున్న సైనికులను ఒకచోట చేర్చి, ఈ సారి చాలా పెద్ద సేనతో కంపెనీవాళ్ళు, కిట్టూరు కోటను సమీపించారు. కాని, వాళ్ళు కోటను ముట్టడించక, ఖైదీలుగా వున్న తమ బ్రిటిషు సైనికులను వదిలి పెడితే తిరిగిపోతామని, రాణీ చెన్నమ్మకు వార్త పంపారు.



రాణీ చెన్నమ్మ ఆ మాట నమ్మి, ఖైదీలైన బ్రిటిషు సైనికులందరినీ విడుదల చేసింది. వాళ్ళు రాణీకి తమ కృతజ్ఞత చెప్పుకుని, ఏనాటికీ తాము కిట్టూరుపై కత్తి కట్టమని ప్రమాణం చేసి, వెళ్ళిపోయారు.

విడుదలైన సైనికులు తమ డేరాలకు రాగానే, ఈస్టిండియా పటాలాలు కిట్టూరుకోటపై ముట్టడి ప్రారంభించినై. కోటలో ఖైదీలుగా వుండి వచ్చిన సైనికుల ద్వారా, ఎక్కడ మందు గుండు సామగ్రి నిలవ చేయబడిందో వాళ్ళు తెలుసుకుని, దానిపై కాల్పులు చేశారు. మందుగుండు ఒక్కసారిగా పేలిపోయింది. రాణీకి కోటను రక్షించు కోవటం సాధ్యపడలేదు.





ఈ విధంగా మోసం చేసి ఈస్టిండియా కంపెనీవాళ్ళు, కిట్టూరును ఆక్ర మించుకోగలిగారు. రాణీ చెన్నమ్మ ఖైదీగా పట్టుకోబడింది. కిట్టూరు రాజ్యంపై, తమ ఆధిపత్యాన్ని అంగీకరిస్తే ఆమెను విడుదల చేస్తా మన్నారు, కంపెనీవాళ్ళు. అందుకు ఆమె నిరాకరించింది. ఈ విధంగా రాణీ చెన్నమ్మ బ్రిటిషు వాళ్ళచేత బిల్‌హొంగల్ అనే కోటలో ఖైదు చేయబడి, 1829 వ సంవత్సరంలో మరణించి, చరిత్రలో అమరురాలైంది.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

## ?

ఎరిగిన వాడొకడు అవంతి వద్దకు వచ్చి, "రాజధానిలో మా అన్నకు ఒక ఉత్తరం రాసి పెడతావా?" అని అడిగాడు.

"దానికేం గాని, ఇప్పట్లో నేను రాజధానికి వెళ్ళటం పడదు," అన్నాడు అవంతి.

"అయ్యా, బాబూ! నేను నిన్ను రాజధానికి వెళ్ళమనటం లేదు. అక్కడ ఉన్న నా అన్నకు ఉత్తరం రాసి పెట్టమని మాత్రమే అడుగుతున్నాను," అన్నాడు ఎరిగినవాడు.

"నా కా సంగతి అర్థమయిందిలే. కాని నా దస్తూరీ నాకు తప్ప ప్రపంచంలో ఇంకెవరికీ అర్థంకాదు," అన్నాడు అవంతి.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు డిసెంబర్ 20 లోగా చేరాలి. అందులో ఫోటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '78 ఫిబ్రవరి చందమామలో ప్రకటించబడును.

---

అక్టోబర్ నెల పోటీ ఫలితం: కత్తిసాము సరదా, కదనంతో సరి!

గెలుపొందిన వారి పేరు: టి. రామకృష్ణ, ఎం. ఎ., సిమెంట్ నగర్,

(కర్నూలు జిల్లా)

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



S. Paramasivan



Sambhu Mukherjee

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ డిసెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. **25**/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–**26.**

---

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ప్రపంచం మిథ్య

రెండవ ఫోటో : ప్రయాణం మధ్య

పంపినవారు : ఆర్. సంజీవమ్మ, గిరిపురం, తిరుపతి-1

**బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.**

Printed by B. V. REDDI at Prasad Process Pvt. Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor: NAGI REDDI




THE KARUR VYSYA BANK LTD.




THE KARUR VYSYA BANK LTD.
SERVICE & SECURITY

దేశంలో 80 శాతం ప్రజలు గ్రామాల్లో వుంటారు. వీళ్లకు డబ్బు లేదు. జాతీయకరణ చేసేక బ్యాంకు వీళ్లకు తోడ్పడి వాళ్ల కాళ్లమీద నిలబడేలా చేసింది.



















రామూ, రవీ యూకోబ్యాంక్ అందరిదీ అని గుర్తుంచుకోండి. చిన్నా, పెద్దా, బీదా, గొప్ప అనే భేదం లేదు. అందరికీ సహాయం చేయడమే యూకోబ్యాంక్ లక్ష్యం.



# పార్లే క్రాక్‌జాక్ నాట్యం

"సరిగా...గా..గా ఉప్ప

"తోం తరిగిణతోం తియతియ్యగా"

విడిగా
అమ్మబడవు—
అనుకరణలుంటా
జాగ్రత్త!

తియ్యగా ఉప్పగా ఆ రుచి ఎంతో హాయ్ హాయ్
క్రాక్‌జాక్‌తో మజాగా కొట్టండి ఇకపై జై జై



పార్లే

క్రాక్‌జాక్ — తీపి ఉప్పూ-రెండు రుచులూగల ఒకే ఒక కమ్మటి బిస్కట్

